



C for Clown, for Caramilk. C for Cowb

Cara or Clown, C r Caramilk. C

Cool, amilk. C Clown, C for

mil Cool, C for Car k. C for C

fo milk. C for Cool, C f ramilk.

Cow y, C for Caramilk. C for C , C fo

milk. C for Cowboy, C for Carami C f

for Caramilk. C for Cowboy, C for Caram



Clown, or Caramilk. C for Cowboy, C

milk. Clown, C for Caramilk. C for




for C C for Clown, ramil

Cool, Caramilk. n, C for

milk. f Cool, C for C milk. C for C

for rami . C for Cool,




Cowboy, C for Caramilk.

HTA 8194.

# సరి కొత్త ప్యారీస్ మిల్క్ బిస్కట్ల పొడుపు కథ










ప్యారీస్ మిల్క్ బిస్కట్లలో

చాలాచాలా మార్పులే వచ్చాయి.

ఇది కేవలం ఆకర్షణీయమైన

సరికొత్త పాకెట్ మాత్రమేకాదు.



లోపల బిస్కట్ల నాణ్యం కూడా మెరుగు అయింది!

సరికొత్త సునంపన్నమైన, పౌష్టిక విలువలున్న బిస్కట్లు.

లోగడకన్నా యిప్పుడు మరింత కరకరగానూ, మరింత తాజాగానూ,

మరింత రుచికరంగానూ వుంటాయి!



## చందాదారులకు గమనిక!

చందమామకు వేలకొలది చందాదారులు ఉన్నారు. కాబట్టి, కవర్ల మీద చిరునామా సిద్ధం చేయడం మొదలైనవన్నీ ప్రతినెలా మొదటివారంలోనే పూర్తి చేయవలసి ఉంటుంది. పత్రిక మీకు ఆలస్యం కాకుండా సకాలంలో అందాలంటే మీ చిరునామాలో మార్పులేమైనా వుంటే వెంటనే మాకు తెలియపరచడం చాలా అవసరం. ఈ విషయంలో మాతో సహకరించాలని కోరుతున్నాము.

డాల్టన్ ఏజన్సీస్
సబ్‌స్క్రిప్షన్ సెక్షన్
చందమామ బిల్డింగ్స్
మద్రాసు – 600 026



జవాబు: అవును, ఆ మూడూను!






మేఘాలలో తేలిపొండి! 'మేగీ స్కై ఫ్లైజర్'లో

'మేగీ జిగ్సా పజిల్'లో
మేగీ సాహసమయ ప్రపంచం
సమకూర్చుకోండి.





మేగీ 'ఏస్ ఎడ్వెంచరర్స్ గేమ్'లో
సముద్రం నుండి ఆకాశం వరకూ
యాత్రను పూర్తి చేయండి.

మేగీ 'హూ-డున్-ఇట్ మిస్టరీ'
గేమ్‌లో దొంగను పట్టుకోండి.

# సరదా ప్రియులకు అద్భుత సాహస యాత్రలు!

మేగీ క్లబ్ సదస్యులకు ఉచిత బహుమతులు!

ఇతర గ్రహవాసుల చతురతతో
తలపడండి-మీ తెలివితేటలతో 'మేగీ
రెయిడర్స్ ఆఫ్ ది రెడ్ స్టార్' గేమ్‌లో





ఏయ్! పిల్లలూ! మేగీక్లబ్‌లో చేరి మేగీ సాహస ప్రపంచంలో ప్రవేశించండి!

మీరు మేగీ నూడుల్స్ యొక్క ఐదు ఖాళీ సంచులకు ముందు వైపున ఉండే ఈ [MAGGI 2-Minute noodles logo] ను కత్తిరించి మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం మాకు పంపించండి. అంతే! మీకు 6 నుండి 8 వారాలలో మేగీ క్లబ్ నుండి ఎంతో వినోదాన్ని ఉత్సాహాన్ని కలిగించే బహుమతి అందుతుంది.

గుర్తుంచుకోండి! మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతితోబాటు మీ పేరు, చిరునామా, మీరు పుట్టిన తేదీని పంపండి. ఈసరికే మీరు మేగీ క్లబ్ సభ్యులైతే మీ సభ్యత్వపు నంబరు పంపండి. ఒకవేళ మీరు మేగీ క్లబ్బర్ కాని పక్షంలో మేగీ క్లబ్ సభ్యత్వం పొందటానికిదే సదవకాశం. పై వివరాలు పంపేటప్పుడు సభ్యత్వం కూడా కావాలని వ్రాయండి. మేము మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డును మీ బహుమతితో బాటు ఉచితంగా పంపుతాము.

మా చిరునామా:
**MAGGI CLUB**
P.O. Box 5788 New Delhi-110 055




ఉచిత మేగీ "వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్.
మీరు పొందే ప్రతి 2 బహుమతులతో ఒక మేగీ "వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర ఉచితం.

ఈ సరికి మీరు మీ మేగీ బర్డ్ హౌస్‌ను సేకరించనటయితే ఇప్పుడే సేకరించండి!




# చందమామ

నంస్థాపకుడు: 'చక్రపాణి' సంచాలకుడు: నాగిరెడ్డి

## విలువలకు ప్రాధాన్యతనిచ్చే విద్య!

జూలై నెల రాగానే పాఠశాలలు, కళాశాలలు తెరుస్తారు. విద్యార్థులకు నూతన విద్యాసంవత్సరం ఆరంభమవుతుంది. 'విలువలకు ప్రాధాన్యత నిచ్చే విద్య', 'వృత్తివిద్య' అనే మాటలను మనం తరచూ వింటూ వుంటాం. ఈ రెండు మాటలకూ మధ్య తేడా ఏదైనా ఉన్నదా అన్న విషయం ఇప్పుడు కాస్త ఆలోచిద్దాం!

విద్యార్థిలో సత్ప్రవర్తన కలిగించి, అతని మానసిక అభివృద్ధికీ, బుద్ధివికాసానికీ, శారీరక దారుఢ్యానికీ దోహదం చేసి, అతన్ని సొంత కాళ్ళపై నిలబడగల పౌరునిగా తీర్చిదిద్దేది ఉత్తమ విద్యావిధానం. దీనినే విలువలకు ప్రాధాన్యతనిచ్చే విద్యగా చెప్పుకోవచ్చు.

ఇక వృత్తివిద్య అంటే—తనకు తగిన ఒక వృత్తిని ఎన్నుకుని, ఆ వృత్తిలో శిక్షణ పొంది, ప్రావీణ్యతను సాధించడం. ఆ విద్య, నేర్చినవారికి మాత్రమే కాదు; వారిచుట్టూ వున్న సమాజానికి కూడా ఉపయోగకారిగా ఉండాలి!

'విలువలకు ప్రాధాన్యత నిచ్చే విద్య', 'వృత్తివిద్య' అంటూ పేర్లు వేరయినప్పటికీ—ఈ రెండింటికి మధ్య పెద్ద తేడా లేదనే చెప్పాలి. ఎందుకంటే, వృత్తివిద్యను నేర్చుకునేప్పుడు విద్యార్థికి అలవడే సత్ప్రవర్తన, ఏర్పడే కుశాగ్రబుద్ధి, సమకూర్చుకునే నైతిక బలం, ఆ వ్యక్తిని—సమాజానికీ, దేశానికీ ఉపయోగపడే ఆదర్శ పౌరునిగా తీర్చిదిద్దే అవకాశం ఎంతయినా ఉన్నది!

సంపుటి 90 జూలై '92 సంచిక 1

విడి ప్రతి: 4-00 :: సంవత్సర చందా: 48-00





CHITRA

వార్తలు-విశేషాలు:

# అఫ్ఘనిస్తాన్‌లో శాంతి



ఆఫ్ఘనిస్తాన్‌లో దాదాపుపధ్నాలుగుసంవత్స రాలపాటు నెలకొన్న యుద్ధవాతావరణం ముగిసింది. ముజాహిదీన్ గెరిల్లాలు మొదట-సోవియెట్ యూనియన్ ఏర్పాటు చేసిన బబ్రాక్ కర్మాల్ ప్రభుత్వంతోనూ, ఆ తరవాత డా॥ నజిబుల్లా ప్రభుత్వం తోనూ, పోరాడసాగారు. అంతే కాదు. మత తీవ్రవాద వర్గాలు తమలో తాము పోరాడుకోసాగాయి!

డా॥ నజిబుల్లా అధ్యక్ష పదవినుంచి దిగిపోవడానికి సంసిద్ధతను తెలియజేశాక, ముజాహిదీన్‌లు, ప్రొఫెసర్ సిబ్గతుల్లాను తాత్కాలిక ప్రభుత్వానికి నాయకత్వం వహించమని కోరారు. ఆయన ముప్పై ఒక్క మందిగల 'కౌన్సిల్' ను ఏర్పాటు చేసి, అందులో చేరమని మత తీవ్రవాద పక్షమైన హెజ్బ్-ఇ-ఇస్లామీ నాయకుడు గుల్‌బుద్దీన్ హెక్‌మత్యార్‌ను కోరాడు. అలా చేరడానికి హెక్‌మత్యార్ కొన్ని షరతులు విధించాడు. నజిబుల్లా ప్రభుత్వానికి మద్దతునిచ్చిన జనరల్ అబ్దుల్ రషీద్ దోస్తుమ్ నాయకత్వంలోని ఉజ్బెక్ సైనికులను రాజధాని కాబూల్‌నుంచి తొలగించాలన్నది ముఖ్యమైన షరతు. అయితే,



ఎటువంటి షరతూ లేకుండా కౌన్సిల్‌లో చేరాలని సిబ్గతుల్లా అభిప్రాయం వెలిబుచ్చాడు; దానికి రక్షణమంత్రి, జమాత్-ఇ-ఇస్లామీ నాయకుడూ అయిన అహ్మద్ షా మసూద్ మద్దతునిస్తున్నాడు.

ఇది ఇలా వుండగా, హెజ్బ్-ఇ-ఇస్లామీ సైనికులు జనరల్ దోస్తుమ్ సేనలతో పోరాటానికి దిగి కాబూల్ నగరంమీద బాంబుల దాడి ప్రారంభించారు. ఆ దాడిలో పురాతన రాజభవనాలూ, ఆఖరికి అధ్యక్షుడి భవనమూ దెబ్బతిన్నాయి. అందువల్ల వెంటనే సైనికులను తొలగించడం క్షేమం కాదని తాత్కాలికప్రభుత్వం భావిస్తున్నది.

జలాలుద్దీన్ హక్కానీ నాయకత్వంలోని ఒక కమిషన్, వివిధ వర్గాలమధ్య సయోధ్యను కుదర్చడానికి మంతనాలు జరిపే తన ప్రయత్నాన్ని కొనసాగించింది. దాని ఫలితంగా, తాత్కాలిక ప్రభుత్వ సభ్యులు; హెక్మత్యార్‌తో విడివిడిగా చర్చలు జరిపారు. అయితే, ఆయన మసూద్‌తో జరపవలసిన చర్చలు కారణాంతరాలవల్ల వాయిదా పడింది. ఆఖరికి మే 25వ తేదీ, జరిగిన సమావేశంలో పాత కక్షలను పాతిపెట్టి, ఇస్లామిక్ తాత్కాలిక ప్రభుత్వాన్ని నిలబెట్టాలని నిర్ణయం తీసుకున్నారు. పోరాటాలకు స్వస్తి చెప్పాలని కూడా తీర్మానించారు.

ఆరు నెలలలోగా ఎన్నికలు జరపాలనీ, కాబూల్ నుంచి సేనలను ఉపసంహరించుకునేట్టు చేయాలనీ నిర్ణయాలు తీసుకున్నారు. కాబూల్ నుంచి సేనలను ఉపసంహరించుకుంటే తప్ప, హెక్మత్యార్ ప్రభుత్వంలో పాలుపంచుకోడానికి నిరాకరించారు. అయినా, ఎన్నికలు జరిగేంత వరకు తాత్కాలిక ప్రభుత్వం కొనసాగాలంటే సేనలు ఉండడం చాలా అవసరమని ఇతరులు భావిస్తున్నారు.







# రాక్షసుడితో వివాహం

పూర్వం స్వర్ణపురిని ధర్మవర్ధను డనే రాజు పాలించేవాడు. ఆయన కుమార్తె సువర్ణసుందరి గొప్ప సౌందర్యవతి. కౌండిన్యపురిని పాలించే సర్పదష్టుడికి, చారులద్వారా ఆమెను గురించి తెలిసింది. వెంటనే అతడికి సువర్ణసుందరిని వివాహ మాడాలన్న కోర్కె కలిగి, దూతద్వారా ధర్మవర్ధనుడికి కబురు పంపాడు.

స్వర్ణపురి కంటే, కౌండిన్యపురి పెద్ద రాజ్యం. సర్పదష్టుడు, ధర్మవర్ధనుడి కంటే అన్ని విధాలా బలవంతుడు. అయినా రెట్టింపు వయసున్న సర్పదష్టుడికి, కుమార్తెను రెండవ భార్యగా పంపడం ధర్మవర్ధనుడికి ఇష్టం లేదు. అందువల్ల, ఆయన మర్యాదపూర్వకంగానే సర్పదష్టుడి కోర్కెను తిరస్కరించాడు.

సహజాహంకారీ, దుష్టుడూ అయిన సర్పదష్టుడికిది అవమానకరంగా తోచింది. వెంటనే అతడు సేనలతో స్వర్ణపురి పైన దండెత్తి, ధర్మవర్ధనుడిని ఓడించి, ఆయననూ, భార్యనూ చెరసాలలో పెట్టించాడు.

తర్వాత అతడు సువర్ణసుందరిని కలుసుకుని, "నీ సౌందర్యాన్ని గురించి విన్నక్షణంలోనే, నిన్ను వివాహమాడాలన్న కోర్కె కలిగింది. ఇష్టపూర్వకంగా నన్ను వివాహమాడావంటే, నీ తల్లిదండ్రులను చెరసాలనుంచి విడిపించి, రాజ్యం తిరిగి ఇచ్చివేస్తాను. కాదంటే, బలవంతంగానైనా నిన్ను వివాహమాడక మానను," అన్నాడు.

ఇందుకు సువర్ణసుందరి కోపంగా, "పుష్పాన్ని బలవంతంగా వికసింప చేయలేమన్న సత్యాన్ని గ్రహించలేని మూర్ఖుడివి నువ్వు. తప్పనిసరయితే, నరభక్షకుడైన రాక్షసుడినైనా వివాహ

తిరుమలశ్రీ



సువర్ణసుందరి తెల్లబోయి, "ఇదేమిటి? మాటవరసకు ఏదో అన్నంతమాత్రాన, నిన్ను పెళ్ళాడతానని ఎలా అనుకున్నావు? మానవకాంతకూ, రాక్షసుడికీ ఎలా పొత్తు కుదురుతుంది!" అన్నది.

"నువ్వు రాకుమారివి! అడిన మాట తప్పరాదు," అన్నాడు రాక్షసుడు.

ఒకపక్క సర్పదష్టుడి దౌర్జన్యానికి తోడుగా, ఈ రాక్షసుడి పీడ కూడా వచ్చి పడినందుకు, సువర్ణసుందరి కొంతసేపు విచారించి, చివరికి వాడితో, "నన్ను వివాహమాడాలంటే, నువ్వు మూడు షరతులకు ఆమోదం తెలపాలి," అన్నది.

"ఏమిటా షరతులు?" అని అడిగాడు కంచుకుడు ఆదుర్దాగా.

"మొదటిది—తక్షణం నువ్వు మాంస భక్షణ మానెయ్యాలి. రెండవది—నీ హింసాప్రవృత్తిని వదులుకోవాలి. మూడవది—మా రాజ్యంలో ఒక జీవనది ప్రవహిస్తున్నది. కాని, దానికి ఒకచోట ఒక చిన్న కొండ అడ్డంగా వుండడంతో, చాలా నీరు వృథాగా సముద్రంలోకి ప్రవహిస్తున్నది. నీవా కొండను తొలగిస్తే, మా రాజ్యంలో మరిన్ని ప్రాంతాలు సస్య శ్యామలమౌతాయి," అన్నది.

కంచుకుడు షరతుల్ని ఆలకించి, "కొండను తొలగించడం క్షణాల మీద

మాడతానుగాని, నీవంటి దుష్టుణ్ణి మాత్రం ఏ పరిస్థితిలోనూ వివాహమాడను," అని జవాబిచ్చింది.

ఈ జవాబుకు సర్పదష్టుడు మండిపడి, "నీకు నెల రోజులు గడువిస్తున్నాను. ఈలోపల మనసు మార్చుకోకపోయావో బలవంతంగా నీ మెడలో తాళి కడతాను. నీ తల్లిదండ్రులకు ఉరిశిక్ష విధిస్తాను," అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ వెంటనే ఒక రాక్షసుడు, సువర్ణ సుందరి ఎదట ప్రత్యక్షమై, "నేను కంచుకుడనే రాక్షసుణ్ణి! ఇటుగాపోతూ, నీ పలుకులు ఆలకించి వచ్చాను. నన్ను పెళ్ళాడు," అన్నాడు.

చేయగలను. కాని, మొదటి రెండు షరతులే చాలా కష్టసాధ్యమైనవి. అయినా, నీ కోసం వాటిని సాధించి, త్వరలోనే తిరిగొస్తాను,'' అంటూ మాయమయ్యాడు.

వారం రోజులు గడిచేసరికి, నదికి అడ్డుగా వున్న చిన్న కొండ తొలగింపబడిందని, సువర్ణసుందరికి తెలిసింది. ఆ తర్వాత వారానికల్లా, కంచుకుడు ఆమె దగ్గిరకు వచ్చాడు. వాడిప్పుడు బాగా చిక్కిపోయి వున్నాడు.

రాకుమారి వాణ్ణి కారణం అడిగింది. వాడు ముఖం దీనంగాపెట్టి, ''నువ్వు పెట్టిన షరతు ప్రకారం మాంసభక్షణ మానాను. కందమూలాలు తిని బతకడం కష్టంగా వున్నది!'' అన్నాడు.

''కంచుకా! నీ పట్టుదలకు మెచ్చాను. నిన్ను వివాహమాడడానికిప్పుడు, నాకే అభ్యంతరమూలేదు," అనిసువర్ణసుందరి, వాడితో సర్పదష్టుణ్ణి గురించి చెప్పి, ''ముందు ఆ దుర్మార్గుడి అడ్డంకి తొలగిపోవాలి కదా, వాణ్ణి చంపు!'' అన్నది.

అందుకు కంచుకుడు కొంచెంసేపు ఆలోచించి, ''నాకు సర్పదష్టుణ్ణి చంపడానికి క్షణం పట్టదు. కాని, ఇప్పుడా పని చెయ్యలేను. నీ షరతుప్రకారం నేనిప్పుడు శాంతస్వభావుణ్ణయిపోయాను. హింస నాకు గిట్టదు,'' అన్నాడు.



ఇది వింటూనే సువర్ణసుందరికి చాలా ఆనందం కలిగింది. తన కోసం వాడు తన రాక్షసప్రవృత్తినే మార్చుకున్నాడు. తొలిసారిగా ఆమెకు, వాడిపై ఇష్టం కలిగింది.

ఆమె ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, కంచుకుడితో, ''సర్పదష్టుడు జీవించి వున్నంతకాలం, మన వివాహం సాధ్యపడదు. వాడు అన్యాయంగా మా రాజ్యాన్ని కబళించి, నా తల్లిదండ్రులను చెరసాలలో బంధించి, నన్ను బలవంతంగా పెళ్ళాడాలని చూస్తున్నాడు. అలాంటి వాణ్ణి చంపడంవల్ల, నీ వ్రతానికి భంగం కలుగుతుందనుకోకు,'' అన్నది.



"రాకుమారీ! ఏమాలోచించావు? ఏమిటి నీ నిర్ణయం?" అని అడిగాడు.

రాకుమారి ఏదో జవాబు చెప్పబోతున్నంతలో, సర్పదష్టుడు సుడిగాలిలా అక్కడికి వచ్చి, రాక్షసుడికేసీ, సువర్ణసుందరికేసీ ఒకసారి గుడ్లురుముతూ చూసి, "అంత నిర్భయంగా మాట్లాడుతున్నావు, ఎవడీ రాక్షసుడు?" అని సువర్ణసుందరిని ప్రశ్నించాడు.

సువర్ణసుందరి ఏమీ తొట్రుపడకుండా, "ఇతడూ, నీలాగే నన్ను వివాహమాడాలని చూస్తున్నాడు. అయితే, నీమాదిరిగా నన్ను నిర్బంధించి కాదు, ఇష్టపడితేనే!" అన్నది.

ఆ మరుక్షణం, సర్పదష్టుడు ఒరలోంచి కత్తి దూసి, "ఓరీ, రాక్షసాధమా! నాతో పోటీ పడడానికి, నీకెన్ని గుండెలు! ఇప్పుడే నిన్ను యమపురికి అతిథిగా పంపిస్తాను," అంటూ కత్తితో కంచుకుడి గుండెల్లో పొడవబోయాడు.

ఇది చూసి కంచుకుడు కోపోద్దీపుడై, సర్పదష్టుడి చేతిలోని కత్తిని లాక్కుని, సర్పదష్టుణ్ణి వడిసి పట్టుకుని పైకెత్తి, గాలిలో గిరగిరా తిప్పి దూరంగా విసిరివేశాడు. ఆ పాటుకు సర్పదష్టుడు నెత్తురు కక్కుకుని, అప్పటికప్పుడే మరణించాడు.

తమ రాజు అలా మరణించగానే, రాక్షసుడికి భయపడి కౌండిన్యపురి సేనలు,

అయినా కంచుకుడు అంగీకరించక, "దుష్టుణ్ణి చంపడం తప్పు కాకపోవచ్చు! కాని నాకెలాంటి హానీ తలపెట్టనివాణ్ణి చంపి, నిన్ను పెళ్ళాడడమంటే, అది స్వార్థం కిందికి వస్తుంది. అందువల్ల నేనా పని చెయ్యలేను," అన్నాడు.

సువర్ణసుందరి వెంటనే అతడి కేమీ జవాబివ్వలేక, "సరే, నన్ను కొంచెం ఆలోచించుకోనీ. ఒక వారం తర్వాత, ఈ ఉద్యానవనంలోనే కనిపించు," అన్నది.

వారం గడిచింది. సువర్ణసుందరి ఉద్యానంలోని ఒక చెట్టుకింద కూర్చుని, ఏమి చెయ్యడమా అని ఆలోచిస్తూండగా, కంచుకుడు అక్కడ ప్రత్యక్షమై,

స్వర్ణపురిని విడిచి పారిపోయాయి. స్వర్ణపురి రాజూ, రాణీ చెరసాలనుంచి విడుదల చేయబడ్డారు.

జరిగింది తెలుసుకుని, తమ కుమార్తె రాక్షసుణ్ణి వివాహమాడతానంటే, రాజ దంపతులు కలవరపడ్డారు. సర్పదష్టుడి లాంటి నరరూపరాక్షసులైన మానవుల కంటే, వికృతరూపుడైనా ఉత్తముడైన కంచుకుడు వేయిరెట్లు మేలన్నది, సువర్ణసుందరి. రాజు ధర్మవర్ధనుడు ఆమె వివాహానికి అంగీకరించక తప్పలేదు.

ఒక శుభముహూర్తాన సువర్ణసుందరికీ, కంచుకుడికీ అత్యంత వైభవంగా వివాహం జరిగింది. ఆ సమయంలో ఒక గొప్ప వింత జరిగింది. అదేమంటే—కంచుకుడు, సువర్ణసుందరి మెడలో తాళికట్టగానే, వాడి రాక్షస రూపం పోయి అందాల రాకుమారుడుగా మారిపోయాడు.

అందరూ అమితాశ్చర్యంతో చూస్తూండగా, అతడిలా చెప్పాడు: నేను వత్సల దేశపు యువరాజు విక్రమసేనుణ్ణి. గురుకులంలో విద్య ముగించుకుని దేశపర్యటన చేస్తూండగా, ఒకచోట దేవకామిని ఒకామె తారసపడి, నన్ను తమలోకానికి వచ్చి వివాహమాడవలసిందిగా కోరింది. నేనందుకు అంగీకరించలేదు. ఆమె ఆగ్రహించి నన్ను రాక్షసుడివికమ్మని శపించింది. అంతటి శిక్ష విధించడం న్యాయం కాదని నేను వేడుకోగా శాంతించి, రాకుమారి ఎవరైనా నన్ను ఇష్టపడి వివాహమాడితే, శాపం తొలగిపోయి నాకు తిరిగి మామూలు రూపం వస్తుందని చెప్పింది!

ఇది విని అందరూ హర్షధ్వానాలు చేశారు. సువర్ణసుందరీ, ఆమె తల్లిదండ్రుల ఆనందానికి మేర లేకపోయింది.

తర్వాత విక్రమసేనుడు, సువర్ణసుందరిని తన దేశానికి తీసుకువెళ్ళాడు. కొంతకాలం జరిగాక వత్సల దేశానికే కాక, ధర్మవర్ధనుడికి పుత్ర సంతానం లేని కారణంగా, స్వర్ణపురికి కూడా తానే రాజయి, ప్రజానురంజకంగా చాలా కాలం రాజ్యపాలన చేశాడు.



# రాజనీతి!

హేలాపురి రాజుగారి కోశాధికారి వీరభద్రుడు అవినీతిపరుడుగా పేరు తెచ్చుకున్నాడు. దొంగ లెక్కలు చూపించి, ఖజానా సొమ్ము సొంతానికి వాడుకుంటున్నాడని, అతడి మీద చాలా ఆరోపణలు రాజుగారికి చేరాయి.

అందరూ ఊహిస్తున్నట్టుగానే, ఒక రోజు మహారాజు నుంచి వీరభద్రుడికి పిలుపు వచ్చింది. ఈ దెబ్బతో వీరభద్రుడి కోశాగారపదవి ఊడిపోయినట్టే అనుకున్నారందరూ.

అయితే మహారాజు, అతణ్ణి లెక్కల్లో మరొకసారి అవకతవకలు కనిపిస్తే క్షమించనని గట్టిగా హెచ్చరించి వదిలేశాడు. అవినీతిపరుల్ని ఏమాత్రం సహించని మహారాజు, వీరభద్రుణ్ణి ఎలా క్షమించాడో ఎవరికీ అర్థం కాలేదు. మహారాణి కూడా ఇదే సందేహాన్ని వెలిబుచ్చింది, మహారాజు ముందు.

అందుకు మహారాజు చిరునవ్వునవ్వి, "వీరభద్రుడు అంతగా అందచందాల్లేని కుమార్తె లిద్దరికీ వివాహాలు చేశాడు. చక్కని సొంత గృహం కట్టుకున్నాడు. ఇక్కడ ఉద్యోగం పోతే, మరెక్కడా ఉద్యోగం దొరకనంతగా ఇప్పుడు వయసు మీరిపోయింది. గనక, ఇకముందు ఖజానా సొమ్ము ముట్టడు. ఇన్నాళ్ళు వీరభద్రుడు దొంగలెక్కలు చూపి, మోసం చేస్తున్నాడని అనుమానం కలిగినా పోనీ అని క్షమించి ఊరుకున్నాను. ఈ పరిస్థితుల్లో, కోశాధికారిగా కొత్తవాణ్ణి నియమిస్తే, తిరిగి వీరభద్రుడి కథే మొదలవుతుంది. మరి, నా నిర్ణయం సరైనదా, కాదా? నువ్వే చెప్పు," అన్నాడు.

మహారాణి మందహాసం చేస్తూ, అవునని తల ఊపింది.

—కోనేనాగ వెంకట ఆంజనేయులు






## 4

[జ్యోతిషాచార్యుడి సలహా ప్రకారం, వీరసేన మహారాజు, మహారాణితో కలిసి, సరోవర విడిది భవనంలో విశ్రాంతి తీసుకుంటున్న కుమార్తె విద్యావతిని చూడడానికి మూడవసారి వెళ్ళినప్పుడు అక్కడ ఆమె కనిపించలేదు. ఆమె జాడ తెలుసుకోవడం ఎలాగా అని ఆలోచిస్తూ, మహారాజూ, మహారాణీ, సేనానాయకుడు ఉగ్రసేనుడూ రాజప్రాసాదం చేరారు. తరవాత]

వీరసేన మహారాజు సభామంటపంలో కొలువుదీరాడు. మంత్రులూ, సేనానాయకులూ, దండనాయకులూ, సలహాదారులూ, అందరూ సభకు హాజరయ్యారు. రాజు వారికి యువరాణి అదృశ్యమైన సంగతి క్లుప్తంగా వివరించాడు.

రాజు మాటలు వినగానే సభలో ఒక మూల గుసగుసలు ప్రారంభమయ్యాయి. రాజు అటు కేసి తిరిగి చూశాడు. అప్పుడు రాజుగారి సలహాదారుడు ఒకడు లేచి నిలబడి, ''మహాప్రభువులు మన్నించగలమంటే ఒక చిన్న విన్నపం!'' అన్నాడు.

చెప్పు అన్నట్టు రాజు తల పంకించాడు.

''యువరాణి విద్యావతీదేవిగారిని వేసవి విడిది భవనానికి తరలించినప్పుడు, దీవికి కట్టుదిట్టమైన కాపలా వుంచక పోవడం ఆశ్చర్యం కలిగిస్తున్నది. యువరాణికి తోడుగా ఒక వృద్ధపరిచారికను



మాత్రం పంపడం, ఆహారపానీయాలు తీసుకువెళ్ళే పరిచారికలు సైతం వెంటనే తిరిగి రావాలని జ్యోతిషాచార్యులు నిబంధనలు విధించడం మరీ విడ్డూరంగా ఉన్నది!'' అన్నాడు ఆ సలహాదారు.

అతని మాటలు సభలో కొంత కలకలం పుట్టించాయి.

'' ఈ విషయంలో వాచస్పతాచార్యులను శంకించడం భావ్యం కాదు. ఆయన రాజకుటుంబానికి అత్యంత ఆప్తులు. ఆయనపట్ల మాకు అచంచలమైన విశ్వాసం ఉన్నది. పైగా నిన్న ఆయనే స్వయంగా జగత్పతాచార్యుడితో పాటు వచ్చి, ఈ రోజు వేకువజామున వెళ్ళి యువరాణిని చూసి రమ్మని మాకు సలహా ఇచ్చారు. యువరాణికి కాస్త క్లిష్టమైన దశ ఆరంభం కానున్నదని కూడా హెచ్చరించారు. అటువంటి వారిని శంకించడం ఏమాత్రం సమంజసం కాదు!'' అన్నాడు రాజు.

సభలో ఒక్క నిమిషం నిశ్శబ్దం ఆవరించింది.

'' జగత్పతాచార్యుడు ఎవరు ? '' అని అడిగాడు ఉగ్రసేనుడు.

'' ప్రధాన జ్యోతిషాచార్యుల మిత్రుడు. ఆయన కూడా గొప్ప జ్యోతిష్కుడు. వాచస్పతాచార్యులు ముఖ్య విషయాలలో ఆయనను సంప్రతిస్తూ వుంటారు!'' అన్నాడు రాజు.

యువరాణి అదృశ్యమైన విషయం ప్రజలకు చాటింపు వేయాలని నిర్ణయం తీసుకున్న తరవాత సభ ముగిసింది.

చాటింపు విని ప్రజలు దిగ్భ్రాంతులయ్యారు. నగర ప్రజలు అక్కడక్కడ గుంపులు గుంపులుగా చేరి పలు పలు విధాలుగా మాట్లాడుకోసాగారు.

'' యువరాణిని అపహరించేటటువంటి నీచుడు, మన రాజ్యంలో వుండడు!'' అన్నది ఒక వృద్ధురాలు.

'' సరోవరానికి ఆనుకుని వున్న అరణ్యంలోని కొండగుహలన్నీ, అరచేతిగీతల్లా

నాకు స్పష్టంగా తెలుసు. ఇప్పుడే నేను యువరాణిని వెదకడానికి బయలుదేరు తాను!'' అన్నాడొక యువకుడు.

ఈలోపల యువరాణి అదృశ్యమయిం దన్న వార్త తెలిసిన వాచస్పతాచార్యులు రాజభవనం చేరి, రాజును, ''ప్రభూ! నేను విన్నది నిజమేనా?'' అని అడిగాడు.

''జరగవలసిందేదో జరిగిపోయింది. అయినా, ఇప్పుడు విద్యావతికి ఎటువంటి అపాయమూ రాకూడదు. అందుకు మనం చేయగలిగిందేమిటో సెలవివ్వండి. ఆమె క్షేమం కోరి, నివాసస్థానంలో మార్పును సూచించింది మీరు. అక్కడ జరగకూడనిది జరిగిపోయింది. ఆమె ఇప్పుడు ఎక్కడున్నదో కనుగొనే మార్గం కూడా మీరే చెప్పాలి!'' అన్నాడు రాజు గంభీరంగా.

''విద్యావతి చాలా సుకుమారి. ఆమె ఇప్పుడెక్కడున్నదో కదా? ఆమెకు ఎటు వంటి ఆపదా రాకూడదు!'' అన్నది మహారాణి, కళ్ళనీళ్ళతో.

వాచస్పతాచార్యులు ఒక్క నిమిషం ఏమీ మాట్లాడలేక పోయాడు. ఆ తరవాత రాజదంపతులను ఓదారుస్తూ, ''విచా రించకండి మహారాజా! యువరాణికి ఎటువంటి ఆపదా రాదు. పూర్ణచంద్రు డికి పట్టే గ్రహణంలాంటిదే ఇది. నేను



ఇప్పుడే వెళ్ళి, ఆమె జాతకాన్ని మరొక సారి జాగ్రత్తగా పరిశీలించి చూసి, ఆమె ఏ దిశలో వున్నదో తెలుసుకుని వచ్చి మీకు చెబుతాను!'' అని అక్కడినుంచి బయలుదేరాడు.

ఇంటికి చేరిన వాచస్పతాచార్యులు, విద్యావతి జాతకాన్ని ముందుంచుకుని దీక్షగా పరిశీలించసాగాడు. తాళపత్ర గ్రంథాలను తీసి చదవసాగాడు. ఎంత సేపటికీ జగత్పతాచార్యుడి జాడ లేదు. ఆ రోజే కాదు, మరునాడూ అతడు రాలేదు. మూడవ రోజు కూడా రాలేదు. జగత్పతి ఎక్కడికి వెళ్ళాడా అని వాచస్పతా చార్యులు ఆశ్చర్యంతో ఆలోచించ



సాగాడు. యువరాణి ఉన్నట్టుండి నీరసించి పోవడం; అందుకు తాను సూచించిన నివారణోపాయం; ఆ విషయంగా తాను జగత్పతితో చర్చించిన సంగతి— మొదలైన విషయాలు వాచస్పతి మనసులో కదలాడ సాగాయి.

జగత్పతి, రాజవంశానికి చెందినవాడు. జగత్పతి పితామహుడు కైలాసపతి— హిమగిరి రాజు త్రిలోకపతికి తమ్ముడు. వృద్ధుడైన అన్నకు సంతానం లేనందువల్ల, ఆయన తదనంతరం తానే హిమగిరికి రాజు కాగలనని కైలాసపతి కలలు గన్నాడు. అయితే, త్రిలోకపతి మరణానంతరం, ఆయన సహోదరి కుమారుడు ఉమాపతి హిమగిరి రాజ్యాధికారాన్ని చేపట్టాడు. కైలాసపతి రాజ్యభ్రష్టుడై అరణ్యాల పాలయ్యాడు. హఠాత్తుగా తనకు కలిగిన దురదృష్టానికి కారణం అన్వేషించడంవల్ల, ఆయనకు క్రమంగా జ్యోతిషశాస్త్రంపట్ల ఆసక్తి ఏర్పడింది. దేశదేశాలలోని జ్యోతిష్కులనూ, దైవజ్ఞులనూ సందర్శిస్తూ, మానవ జీవితాలలో విధి తీసుకు వచ్చే మార్పులను గురించి తెలుసుకుంటూ కాలం వెళ్ళబుచ్చాడు. కైలాసపతి కుమారుడు గజపతి కూడా జ్యోతిషంపట్ల ఆసక్తి కనబరిచాడు. ఆయన తన కుమారుడు జగత్పతికి జ్యోతిషశాస్త్రంతో పాటు తాను పురాతన గ్రంథాలనుంచీ, ఆటవిక జాతుల ప్రజల నుంచీ నేర్చుకున్న మంత్ర తంత్రాలనూ, మాయాజాలాన్నీ నేర్పాడు.

జగత్పతి, రాజ్యభ్రష్టులయిన తన తాత తండ్రులు, అరణ్యమధ్యంలో నిర్మించుకున్న భవనాన్ని మరింత బ్రహ్మాండమైన భవనంగా పునర్నిర్మించుకున్నాడు. అక్కడ ఏకాంతంగా మంత్ర తంత్రాలలోనూ, మాయాజాల విద్యలోనూ అహర్నిశలు దీక్షతో కృషిచేస్తూ ప్రావీణ్యతను పెంపొందించుకో సాగాడు.

జగత్పతి జ్యోతిషశాస్త్రం, మంత్ర తంత్రాలతో మాత్రమే తృప్తిపడలేదు.



కాలం కలిసి వస్తే, హిమగిరి రాజ్యానికి కాకపోయినా, మరే రాజ్యానికైనా, ఏనాటికైనా తాను రాజ కాకపోతానా అన్న ఆశకొద్దీ రాజ్యాంగ వ్యవహారాలను కూడా అధ్యయనం చేయసాగాడు. అతడు కలలుగన్న అవకాశం ఇప్పుడు తానుగా వచ్చి తలుపు తట్టినట్టు భావించాడు జగత్పతి!

వీరగిరి రాజు ఏకైక కుమార్తె విద్యావతి సరోవర విడిదిభవనంలో ఒంటరిగా ఉన్నది. ఈ క్లిష్టదశ పూర్తయిన వెంటనే యువరాణికి వివాహయోగం ఉన్నదని వాచస్పతాచార్యులు సెలవిచ్చారు. విద్యావతి వివాహం తనతో అయినట్టయితే వీరగిరి సింహాసనం తన వశమవుతుంది కదా, అన్న ఆలోచన జగత్పతిని ఒక చోట నిలబడ నివ్వలేదు. రహస్యంగా వెళ్ళి సరోవర పరిసర ప్రాంతాలను పరీక్షించి చూశాడు. పడవ రేవుకు దూరంగా చెట్ల మధ్య వున్న చిన్న మార్గాన్ని కనుగొన్నాడు. ఎవరికీ తెలియకుండా అక్కడొక పడవను కూడా ఏర్పాటు చేశాడు.

విడిది భవనంలో వున్న యువరాణిని రహస్యంగా అరణ్యమధ్యంలో వున్న మాయాభవనానికి తరలించుకుని వెళ్ళి, అక్కడే దాచి వుంచి, గ్రహస్థితి బాగుపడిన తరవాత, ఏమీ ఎరగనట్టు తనే ఆమెను తీసుకొని వెళ్ళి రాజుకు అప్పగించినట్టయితే, రాజదంపతులు పరమానందభరితులైపోతారు. కృతజ్ఞతా భావంతో వాళ్ళు యువరాణిని తనకే ఇచ్చి వివాహం జరపవచ్చు—జగత్పతి ఇలా ఆలోచించి తన పథకానికి కార్యరూపం ఇవ్వడానికి రంగంలోకి దిగాడు!

అసలు విషయం తెలియని వాచస్పతాచార్యులు, జగత్పతి కోసం ఎదురు చూశాడు. కాని, మూడు రోజులయినా జగత్పతి జాడ కనిపించలేదు. నాలుగవ రోజు వాచస్పతాచార్యులు రాజదర్శనానికి బయలుదేరాడు.



రాజభవనం చేరేసరికి అక్కడ సేనా నాయకుడు ఉగ్రసేనుడు, యువరాణిని వెతకడానికి భటులను నలువైపులకూ పంపిన వివరాలను రాజుకు వివరిస్తున్నాడు. వాచస్పతిని చూడగానే రాజు, "విద్యావతి క్షేమంగా ఉన్నది కదా ?" అని అడిగాడు.

"మహారాజా! ఈ విషయంలో మీకు అణుమాత్రం కూడా అనుమానం వద్దు. యువరాణి సురక్షితంగా ఉంటుంది. ఆమెకు ప్రాణభయం లేదు. గ్రహబలాన్నిబట్టి చూస్తే, యువరాణి ఇప్పుడు రాజధానీ నగరానికి పశ్చిమ దిశలో ఉండాలి. కాబట్టి ఆ దిశలో వెతికించడం మంచిది!" అన్నాడు వాచస్పతాచార్యులు.

"మన రాజ్యానికి పశ్చిమంగా, కొండలూ, అడవులే కదా ఉన్నాయి! అయినా, మన సైనికులు, ఆ మహారణ్యంలో మానవమాత్రులు వెళ్ళగలిగినంత దూరం వెళ్ళి, వెతికి వచ్చారు. ఉత్తర దిశగా వెళ్ళిన సైనికులు మాత్రం ఇంకా తిరిగి రాలేదు!" అన్నాడు ఉగ్రసేనుడు.

"వాళ్ళు రానీ, ఆ తరవాత జ్యోతిషాచార్యుల సలహా ప్రకారమే మరికొంత మంది సైనికులను మళ్ళీ దక్షిణ దిశకు పంపుదాం. అది సరేగాని, ఎవరో ఒక యువకుడు విద్యావతిని వెతకడానికి అనుమతి కోరుతున్నట్టు చెప్పావు. ఎక్కడా యువకుడు? సైనికులను తనవెంట పంపమంటున్నాడా ఏం?" అని అడిగాడు రాజు.

"లేదు మహారాజా! అతడు విద్యావతిని వెదకడానికి ఒంటరిగానే వెళతాడట. అందులో విజయం సాధిస్తే సరేసరి. ఒకవేళ ఆ ప్రయత్నంలో తను ప్రాణాలు కోల్పోయినట్టయితే, వేరొక దిక్కులేని వృద్ధురాలయిన తన తల్లి సంరక్షణా బాధ్యతలు మనమే స్వీకరించాలని ప్రార్థిస్తున్నాడు. ఆ యువకుణ్ణి

చూస్తూంటే సామాన్యుడిలా కనిపించడం లేదు. అతనికి ఒక అవకాశం ఇవ్వడం మంచిదనుకుంటాను. అందులో అతడు విజయం సాధించినా ఆశ్చర్యం లేదు!'' అన్నాడు ఉగ్రసేనుడు.

''అలాగా? ఎక్కడా యువకుడు?'' అని అడిగాడు రాజు.

''కోట గుమ్మం ముందే ఉన్నాడు. పిలిపించమంటారా?'' అని అడిగాడు ఉగ్రసేనుడు.

''తీసుకు రమ్మను,'' అన్నాడు రాజు.

ఆ యువకుణ్ణి లోపలికి తీసుకు రమ్మని, అక్కడ నిలబడిన ఒక భటుణ్ణి ఆజ్ఞాపించి, ఉగ్రసేనుడు, వాచస్పతాచార్యులకేసి తిరిగి, ''మీరీ మధ్య జగత్పతాచార్యులను చూశారా?'' అని అడిగాడు.

''లేదు! ఆయన నా దగ్గరికి వచ్చి నాలుగు రోజులయింది. రోజూ వచ్చేవాడు; ఇప్పుడు రాకపోవడం ఆశ్చర్యంగా ఉన్నది. మరేదైనా కార్యంమీద వేరెక్కడికయినా వెళ్ళాడేమో! ఆయన రాగానే మీ దగ్గరికి పంపమంటారా?'' అని అడిగాడు వాచస్పతాచార్యులు.

''వద్దు. నాలుగు రోజుల క్రితం, మీతో పాటు జగత్పతాచార్యులు కూడా రాజదర్శనానికి వచ్చాడని రాజుగారు చెప్పారు. ఇప్పుడు విద్యావతి గురించి ఆయన ఏమైనా చెప్పారేమో తెలుసుకుందామని అడిగాను. అంతే!'' అన్నాడు ఉగ్రసేనుడు.

వాచస్పతాచార్యులు, లేచి నిలబడి రాజుకు నమస్కరించి బయలుదేరబోయాడు. అంతలో భటుడు ఒక యువకుణ్ణి అక్కడికి తీసుకు వచ్చాడు. అందమైన ఆ యువకుడి చురుకైన కళ్ళలోకి చూసి, జ్యోతిషాచార్యులు ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు. యువరాణిని వెతికేందుకు, ఒంటరిగా వెళ్ళడానికి సాహసించిన ఆ యువకుడు ఎవరై ఉంటాడా అని ఆలోచిస్తూ, ఆయన రాజప్రాసాధం వెలుపలికి వచ్చాడు. —(ఇంకావుంది)






# వీణాధరి నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, చేపట్టిన కార్యం సాధించి తీరాలన్న పట్టుదలతో, అర్ధరాత్రివేళ ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నాకు నిన్ను గురించి ఒక శంక కలుగుతున్నది. అదేమంటే—అసలు నువ్వు సాధించదలచిన కార్యమేమిటి? అది నీ శక్తిసామర్థ్యాలకూ, ప్రతిభకూ కీర్తిప్రతిష్ఠలు తెచ్చేదా? లేక నలుగురిలో నిన్ను అవమానమూ, అపహాస్యాలపాలు చేసేదా? ఎందుకంటే, ఎవరూ తమ స్థాయికి మించిన పనులకు పూనుకోరాదని అనుభవజ్ఞులు చెబుతూంటారు. వారి మాటల్లోని వాస్తవాన్ని నిరూపించేం

## బేతాళ కథలు



దుకు ఉదాహరణగా, వీణాధరి అనే ఒక యువతి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు.

చంద్రశిలారాజ్యంలో రాజయ్య అనే పేదరైతు వుండేవాడు. అతడి భార్య కామాక్షి. వాళ్ళకు చాలాకాలం గడిచాక, ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ శిశువును చూసి అందరూ అద్భుతం చెందారు. ఆ శిశువు కనుముక్కు తీరుతోపాటు శరీరంమేలిమి బంగారంతో తులతూగేలా వున్నది. అటువంటి అందాలరాశి తన కుమార్తె అయినందుకు రాజయ్య సంతోషించి, ఆమెకు వీణాధరి అని పేరు పెట్టుకున్నాడు.

అలా నెలలూ, సంవత్సరాలూ గడిచిపోతూ, వీణాధరి పెరిగి పెద్దదవుతున్నకొద్దీ, ఆమె సౌందర్యం మరింత వికసించసాగింది. అమ్మలక్కలు ఆమెతో, ''నీ అద్భుత సౌందర్యం చూసి, ఏ రాజకుమారుడో నిన్ను వివాహం ఆడకపోడు!'' అని హాస్యమాడుతూండేవాళ్ళు.

ఈ విధంగా వీణాధరి మనస్సులో తనవంటి అందగత్తెకు సరిజోడు, ఏ రాజకుమారుడో తప్పసామాన్యుడు కాదనే అభిప్రాయం బలంగా ముద్రపడిపోయింది.

రాజయ్య మిత్రుడు చంద్రయ్యకు శివుడనే కొడుకున్నాడు. వీణాధరి పుట్టినప్పటినుంచీ చంద్రయ్య, రాజయ్యతో, ''నీ కూతుర్ని నా కోడలుగా చేసుకుంటాను!'' అంటూండేవాడు.

వీణాధరి, శివుడు యుక్తవయస్కులయ్యారు. ఒకనాడు శివుడు, వీణాధరితో, ''వీణా! నా మనసులోని మాట చెబుతున్నాను. నీవంటే నాకు ప్రాణం. నువ్వు అంగీకరిస్తే, మన పెళ్ళి జరిగేలా చూస్తాను,'' అన్నాడు.

అందుకు వెంటనే వీణాధరి, ''నిన్ను పెళ్ళాడాలన్న కోరిక నాకేమాత్రం లేదు,'' అన్నది.

ఆ మాటలకు శివుడు నొచ్చుకుని, ''ఇందులో బలవంతం ఏమీ లేదు. నేను

మాత్రం నిన్ను తప్ప మరెవరినీ పెళ్ళాడ లేను,'' అన్నాడు.

ఆ జవాబుకు వీణాధరి మౌనంగా వూరుకున్నది. తనవంటి సామాన్యురాలు, రాకుమారుణ్ణి వివాహమాడి రాణివాసం చేయడానికి అసాధారణమైన సౌందర్యమే కాక, మంచి వేషభాషలు, నడవడిక కూడా అవసరం అని, ఆమె ఆలోచించింది. ఇందుకుగాను, కొంతకాలం మహారాణికి పరిచారికగా వుండి, అనుభవం గడించడం అవసరం అనుకున్నది.

వీణాధరి స్నేహితురాలైన పద్మదీపిక అనే యువతి, మహారాణి చంద్రావతి వద్ద పరిచారికగా పనిచేస్తున్నది. ఆమె ద్వారా, వీణాధరి మహారాణి వద్ద పరిచారికగా ఆశ్రయం సంపాయించింది.

ఒకసారి మహారాణి వద్దకు ఒక చిత్రకారుడు వచ్చి, ''మహారాణీ! నేనొక చిత్రపటం తయారు చేసి, తమకు కానుకగా ఇచ్చేందుకు తెచ్చాను,'' అన్నాడు.

వీణాధరి ఆ చిత్రపటాన్ని అందుకుని, మహారాణికి ఇచ్చింది.

ఆ చిత్రపటంలో అస్తమిస్తున్న సూర్యుడు అద్భుతంగా చిత్రించబడ్డాడు. ఆ చిత్రంలోని రంగుల మేళవింపుకు ముగ్ధురాలైన చంద్రావతి, చిత్రకారుడికి వేయి వరహాలు బహుమతిగా ఇచ్చింది.



తర్వాత ఆమె, వీణాధరిని దగ్గరికి పిలిచి, ''ఎలా వుంది చిత్రపటం?'' అని అడిగింది.

అందుకు వీణాధరి, ''రోజూ చూసే సూర్యుడే గదా! అందులో విశేషమేమున్నది. ఏమయినా, దీనికి వేయి వరహాల బహుమతి చాలా ఎక్కువనుకుంటాను,'' అని జవాబిచ్చింది.

ఆ మాటలకు మహారాణి నవ్వి, ''వీణా, భగవంతుడు నీకు అందమైన రూపం ఇచ్చాడేగాని, కళాహృదయాన్ని ఇవ్వలేదు. సరే, ఇచ్చే బహుమానం మా స్థాయికి తగినట్లుండాలన్న సంగతి నువ్వెరగవా?'' అన్నది.



ఒక రోజు మహారాణీ, మహారాజూ తమ మందిరంలో కూర్చుని వుండగా, వీణాధరి వింజామర వీస్తున్నది. అప్పుడు ఒక గూఢచారి అక్కడికి వచ్చి, "మహారాజా! వైదేహిరాజు మన రాజ్యంపై దాడి చేయడానికి సైన్యాన్ని సమాయత్త పరిచాడు. దాడి ఏ క్షణాన అయినా జరగవచ్చు." అని చెప్పి వెళ్ళిపోయాడు.

యుద్ధవార్త వినగానే వీణాధరి భయంతో కంపిస్తూ, వింజామర వీచడం మరిచిపోయింది. మహారాణి మాత్రం నిశ్చలంగా ఏదో ఆలోచిస్తూ వుండిపోయింది.

మహారాజు, ఆమెతో, "శక్తిసింహుడు దాడి చేయవచ్చుగాని, అది అకస్మాత్తుగా మాత్రం కాదు. అతడు దాటవలసిన స్వర్ణముఖినదీ తీరాన మన సైన్యం తగు జాగ్రత్తలోనే వున్నది!" అని వీణాధరి కేసి తల తిప్పి చూసి, "అంతఃపురంలోని వాళ్ళే యుద్ధవార్త విని ఇంతగా భయపడిపోతే, ఇక సామాన్యుల మాటేమిటి? ధైర్యంగా వుండడం నేర్చుకో." అన్నాడు.

ఒకనాడు రాణి చంద్రావతి వనవిహారానికి బయలుదేరింది. ఆమెతో పాటు పరిచారికలందరూ బయలుదేరారు. అయితే, వీణాధరి మాత్రం శిరోవేదన నెపం పెట్టి తప్పించుకున్నది. అందుకు కారణం—మహారాణి లేనప్పుడు, ఆమె నగలు అలంకరించుకుని, అద్దంలో చూసుకోవాలన్న కోరిక, వీణాధరికి చాలా కాలంగా వున్నది.

మహారాణి వనవిహారానికి వెళ్ళగానే వీణాధరి, ఆమె పట్టువస్త్రాలు ధరించి, బంగారు ఆభరణాలు అలంకరించుకుని అద్దం ముందు నిలబడింది.

అంతలో ఒక యువకుడు, అక్కడికి వచ్చాడు. అతడు వీణాధరి సౌందర్యానికి అబ్బురపాటు చెంది, "సుందరీ! ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు.

సాధారణమైన దుస్తులు ధరించి వున్న, ఆ యువకుణ్ణి చూసి వీణాధరి, అతణ్ణి ఆటపట్టించాలనుకుని, "నేను

శక్తిపురి రాజ్య యువరాణిని. ఈ రాజ్యం మహారాణి ఆహ్వానం పంపగా విందుకు వచ్చాను," అన్నది హుందాగా.

అందుకా యువకుడు, "నేనీ రాజ్యం యువరాజు విజయదీపుడిని. విద్యాభ్యాసం ముగించుకుని, ఇప్పుడే గురుకులం నుంచి వస్తున్నాను. నీ సౌందర్యం నన్ను దిగ్భ్రాంతుణ్ణి చేసింది. నీకు సమ్మతమైతే, పెద్దల అంగీకారంతో మన వివాహం జరిగేలా చూస్తాను," అన్నాడు.

ఇది విని వీణాధరి, తను పరిహాస మాడింది సాక్షాత్తూ యువరాజుతోనని గ్రహించి ఉలిక్కిపడింది. మరుక్షణం ఆమె విజయదీపుడి పాదాలకు నమస్కరించి, "యువరాజులు క్షమించాలి! నేను మహారాణి పరిచారికను. మహారాణి ఆభరణాలు ధరించి చూసుకోవాలన్న చిత్తచాంచల్యముతోనూ, మీరెవరో తెలియకా తప్పుగా ప్రవర్తించాను. నా తప్పు క్షమించండి!" అని వేడుకున్నది.

నిజంతెలుసుకున్న విజయదీపుడు చిరునవ్వునవ్వి, "భయపడకు! నేను మట్టిలోని మాణిక్యం విలువ గ్రహించగలనే గాని, కాలదన్నిపోను. నువ్వు పరిచారికవైనా, పరిణయమాడదలిచాను," అన్నాడు.

ఆ మాటలతో తేరుకున్న వీణాధరి, "యువరాజా! మిమ్మల్ని ఒక చిన్న ప్రశ్న



అడుగుతాను. నేను వివాహానికి సమ్మతించకపోతే, ఏం చేస్తారు?" అన్నది.

ఆ ప్రశ్నకు విజయదీపుడు ఎంతగానో ఆశ్చర్యపోయి, "యువరాజంత వాణ్ణి అడిగితే, ఏ యువతి కాదనగలదు? నువ్వు అంగీకరించకపోతే, అందుకు కారణం నువ్వు వట్టి అహంకారివైనా అయి వుండాలి, లేదా మూర్ఖురాలివైనా అయి వుండాలి. అలా అయిన పక్షంలో నేను, నిన్ను మించిన అందగత్తెను వివాహమాడగలను," అన్నాడు.

ఆ వెంటనే వీణాధరి, "క్షమించండి, యువరాజా! నేను మిమ్మల్ని వివాహమాడలేను. కారణం, నా వివాహం మరొకరితో,

ఏనాడో నిశ్చయమైపోయింది.'' అని అక్కడి నుంచి బయలుదేరి గ్రామంచేరి, తనను ప్రేమించిన శివుణ్ణి వివాహమాడింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, వీణాధరి చిన్నప్పటి నుంచీ రాజకుమారుణ్ణి వివాహమాడాలని కలలు కన్నది కదా! ఆ కలలు నిజమవుతున్న క్షణంలో, చేజేతులా జారవిడుచుకోవడానికి కారణం ఏమిటి? తను ఒక దేశం రాణి కావడానికి అనర్హురాలని గ్రహించడంవల్లనా? మహారాణి, ఆమెలో కళాహృదయం లేదని చిన్నగా మందలించింది. మహారాజు, ఆమెకు ధైర్యంగా వుండడం నేర్చుకోమని గట్టిగానే చెప్పాడు. ఇది జరిగాక, వీణాధరి తన స్థాయికీ, శక్తిసామర్థ్యాలకూ మించిన కార్యం సాధించపూనానని గ్రహించి వుంటుందా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వీణాధరి, యువరాజును తిరస్కరించడానికి అవేవీ కారణాలు కావు. ఆమె తను కన్న కలలు వాస్తవం చేసుకున్నాక, ఇక స్థాయి, శక్తిసామర్థ్యాల ప్రసక్తే వుండదు. ఆమె, యువరాజును అడిగిన ప్రశ్నకు, అతడు ఇచ్చిన జవాబే, ఆమె అతణ్ణి వివాహమాడ నిరాకరించడానికి ముఖ్య కారణం. వీణాధరి తనతో వివాహానికి అంగీకరించక పోతే—ఆమెను మించిన మరొక అందగత్తెను వివాహమాడగలనన్నాడు, యువరాజు. దీని అర్థమేమంటే—ఏదో ఒకనాడు వీణాధరిని మించిన సౌందర్యవతి కంటబడితే, యువరాజు ఆమెను భార్యగా చేసుకోగలడు. అప్పుడు వీణాధరి పరిస్థితి హీనమైపోతుంది. ఇది ఆలోచించే, ఆమె తన పగటికలలకు స్వస్తి చెప్పి, తన నెంతగానో ప్రేమిస్తున్న, తండ్రి స్నేహితుడి కొడుకైన శివుణ్ణి వివాహమాడింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : ఎస్. శివనాగేశ్వరరావు రచన]









# తల్లి ఋణం

గణపవరం అనే ఊళ్ళో, శాంతమ్మ అనే ఆమెకు ఇద్దరు కొడుకులు. భర్త పోయిం తర్వాత శాంతమ్మ ఇద్దరు కొడుకుల ఇళ్ళలోనూ ఆరేసినెలలు వుంటూ, కాలం వెళ్ళబుచ్చుతున్నది. పెద్దకొడుకు మంచి ఐశ్వర్యవంతుడి కింద లెక్క. చిన్నవాడికి వుండడానికి ఒక మంచి ఇల్లున్నది. భార్యాబిడ్డలను పోషించుకునేందుకు సరిపడే సంపాదన గల చిన్న ఉద్యోగాన్ని, ఆ ఊళ్ళోనే సంపాదించుకున్నాడు.

ఇలా వుండగా, శాంతమ్మకు అకస్మాత్తుగా జబ్బు చేసి, చిన్నకొడుకు ఇంట్లో వుండగా పోయింది. ఆ వార్త వినగానే పెద్దవాడి కుటుంబమంతా, చిన్నవాడి ఇంటికి చేరుకున్నది. పెద్దకొడుకు రాముడు దుఃఖం పట్టలేక తమ్ముడితో, ''ఒరే, సోముడూ! అమ్మ ఋణం నువ్వు తీర్చుకున్నావు. అందువల్లనే అమ్మ, ఆఖరి క్షణాల్లో నీఇంటపోయింది. పెద్దకొడుకును కాబట్టి, అమ్మ అంత్యక్రియల ఖర్చులన్నీ నేనే భరిస్తాను,'' అన్నాడు.

ఈ సంగతి తెలిసి, వచ్చిన బంధువులందరూ, ''ఆహాఁ, కొడుకంటే రాముడే!'' అని మెచ్చుకున్నారు.

రాముడు మాటంటే ఏదో ఆవేశంలో అనేశాడు గాని, పదకొండు రోజులపాటు జరిగిన కర్మకాండలో అయిన ఖర్చు తలుచుకునేసరికి, వాడికి గుండె గుభేలు మన్నది. పెద్దకర్మ చివరిరోజున అన్నదమ్ములిద్దరూ, బంధువులతో కలిసి చెరువు దగ్గరకు వెళ్ళారు. అన్నదమ్ములు స్నానం చేశాక, పౌరోహితుడు మంత్రాలు చదవడం ముగించగానే, రాముడు కాకులకు పిండం వేసి భక్తిగా దణ్ణం పెట్టుకున్నాడు.

అయితే, అందరూ ఆశ్చర్యపడేలా, ఆ చుట్టుపక్కల చెట్ల మీద వున్న కాకుల్లో

జె. ఉదయనాగ శిరీష

ఏ ఒకటీ కూడా దగ్గరికి రాలేదు; పిండాన్ని ముట్టలేదు.

అప్పుడు అక్కడ చేరిన బంధువులందరూ పేరుపేరునా తమ దుఃఖాన్ని వెల్లడిచేస్తూ, కాకులను పిండం ముట్టుకోవలసిందిగా దణ్ణాలు పెట్టసాగారు.

ఇంతలో రాముడి మేనమామ, అందరినీ మౌనంగా వుండమంటూ చేయి వూపి, "అక్కా! ఎంతసేపటికీ అందరూ, నీ పెద్దకొడుకు రాముడు పెట్టిన ఖర్చునే మెచ్చుకుంటున్నారనే గదా, నీ బాధ? సోముడు పెట్టిన ఖర్చు గురించి కూడా అందరికీ చెబుతాను. దయచేసి ఆహారం స్వీకరించు!" అంటూ దణ్ణం పెట్టాడు.

అంతే కాకులన్నీ గుంపుగా వచ్చి పిండాన్ని ఎగరవేసుకు పోయాయి.

ఇది చూసి బంధువులందరూ ఆశ్చర్యపడ్డారు. అప్పుడు రాముడి మేనమామ అందరికీ ఇలా చెప్పాడు: తల్లి బిడ్డలందరికీ సమానమే! పెద్దవాడు కర్మ చేయడానికి అవసరం అయిన ఖర్చులన్నీ తను పెడతాననగానే, చిన్నవాడు సోముడు ఊళ్ళోని అనాథశరణాలయానికి పెద్ద మొత్తం శాశ్వత విరాళంగా ఇచ్చి, ప్రతి ఏటా తన తల్లి చనిపోయిన రోజున, పేదవాళ్ళకు అన్నదానం ఏర్పాటు చేశాడు. ఇది తల్లిఋణం తీర్చుకోవడమే అవుతుంది గదా!

మేనమామ ఇలా చెప్పగానే రాముడు దీనంగా ముఖం పెట్టి, "సోముడూ, అమ్మ అంత్యక్రియలకు అయిన ఖర్చు తలచుకుని లోపల నేను బాధపడుతున్న మాట నిజం! నువ్వు మాత్రం గుప్తంగా అమ్మ కోసం శరణాలయానికి విరాళం ఇచ్చావు. నిజంగా అమ్మ ఋణం తీర్చుకున్నవాడివి నువ్వు," అన్నాడు.

అందుకు సోముడు, "అదికాదన్నయ్యా! ఇద్దరు కొడుకులున్నందుకు అమ్మ పరలోక సుఖానికి నువ్వు ఖర్చుపెడితే, నేను ఇహలోకంలో అమ్మ పేరు నిలపాలని ఆశించాను. అయినా, ఎవరూ తల్లిఋణం తీర్చలేరు!" అన్నాడు.



# చందమామ
# అనుబంధం—45

మనదేశపు పక్షులు-జంతువులు :



## కచ్ ఊదాకొంగలు

'ఫ్లమింగో'లు అనే ఒకజాతి ఊదాకొంగల పేరుతో గుజరాత్‌లోని కచ్‌ప్రాంతం పిలువబడుతున్నది. ఆ ప్రాంతాన్ని 'ఫ్లమింగో నగరం' అని అంటారు.

లేతఎరుపు రంగు కాళ్ళతో, వంకర టింకరగా వున్న పొడవాటి మెడతో వున్న ఫ్లమింగో పక్షులు, ఊదారంగు కలిసిన తెలుపు వర్ణంతో, ఇళ్ళల్లో పెంచే పెద్దబాతు పరిమాణంలో వుంటాయి. ఇవి నాలుగడుగుల ఎత్తువరకు పెరుగుతాయి. దృఢంగా వున్న లేతఎరుపు రంగు ముక్కు, సగంలో ముందుకు వంగి వుండడం ఈ పక్షుల ప్రత్యేకత. బాతుకులాగా కాలివేళ్ళను కలుపుతూ, మధ్య చర్మం వుంటుంది. ఇవి లోతులేని నీళ్ళలో తలలు ముంచి, ఆహారాన్ని సంపాయిస్తాయి. ముక్కు ముందుకు వంగి వుండడంవల్ల నేలను గోకి అక్కడ వున్న ఆహారాన్ని పట్టుకోవడానికి వీలుగా వుంటుంది. నాలుక జల్లెడలా పనిచేస్తుంది.

సరస్సులలో, మడుగులలో, చెరువులలో ఇవి చిన్న చిన్న గుంపులుగా నివసిస్తాయి. ఆకాశంలో రెక్కలల్లారుస్తూ V ఆకారంలో ఎగురుతాయి.

అక్టోబర్ – మార్చ్ నెలల మధ్య కచ్‌లోని రాన్ ప్రాంతంలో 5 లక్షల ఫ్లమింగోలు చేరుతాయి. ప్రపంచంలోకెల్లా ఇక్కడే ఫ్లమింగోలు ఎక్కువ సంఖ్యలో గుడ్లుపెట్టి పొదుగుతాయి.

వార్తలలో బాలలు:

# అతిపిన్న వయసు గోల్ఫ్ క్రీడాకారుడు!



తీరికగా ఉన్న ధనవంతులు ఆడుకునే ఆటగా 'గోల్ఫ్'ను చెప్పుకుంటారు. ఆ క్రీడలో కూడా పిల్లలు తమ ప్రతిభను ప్రదర్శించడం ఎంతైనా విశేషం!

షివిన్ అనే ఐదేళ్ళ కుర్రాడు, ఒకనాడు తన తండ్రి పెర్సీ క్యాత్రాతో కలిసి గోల్ఫ్ కోర్సుకు వెళ్ళాడు. విశాల మైదానం పరిగెత్తడానికి అనుకూలంగా వుంటుంది కదా, ఒకవేళ కింద పడినా వెల్వెట్ పరిచినట్టున్న ప్రదేశంలో దెబ్బ తగలదు కదా అని ఆపసివాడనుకున్నాడు. అయినా, అక్కడి ఆటగాళ్ళెవరూ, చిన్న తెల్ల బంతిని కొట్టాక పరిగెత్తడం లేదు సరికదా, వాళ్ళు నింపాదిగా అడుగు మీద అడుగు వేసుకుంటూ నడిచిపోయి, 'హోల్'కూ బంతి పడిన చోటుకూ మధ్యవున్న దూరాన్ని కొలిచి, ఆ తరవాత పాయింటు కోసం బంతిని 'హోల్'లోకి వేయడం గమనించాడు. ఆ ఆటకు ఎక్కువ సమయం తీసుకుంటున్నది. అయినా, ఐదేళ్ళ షివిన్‌లో ఆ ఆటను తను కూడా ఆడాలన్న ఆసక్తి ఏర్పడింది. అప్పటినుంచి తన తండ్రి వెంట తరచూ గోల్ఫ్ మైదానానికి వెళ్ళసాగాడు. కొడుకు ఆసక్తిని గమనించిన తండ్రి, గోల్ఫ్ ఆటలో స్వయంగా శిక్షణివ్వసాగాడు. ఆయన గోల్ఫ్ క్రీడలో మంచి నేర్పరి.

తండ్రి శిక్షణలో షివిన్ మరొక ఐదేళ్ళలో జూనియర్ ఛాంపియన్ అయ్యాడు. తొమ్మిదేళ్ళు నిండక ముందే అతడు మొట్టమొదటిసారిగా అంతర్జాతీయ పోటీలలో పాల్గొన్నాడు. ఇండొనేషియా, జకార్తాలో జరిగిన పన్నెండవ ఆసియా పసిఫిక్ జూనియర్ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొన్నాడు. ఆ పోటీలలో ఐదు దేశాలకు చెందిన ఇరవై మంది జూనియర్ క్రీడాకారులు పాల్గొన్నారు. షివిన్ పదవవాడుగా వచ్చాడు.

గత సంవత్సరం జరిగిన తొమ్మిదవ 'టోపోలిన్ జూనియర్ వరల్డ్ కప్ ఛాంపియన్ షిప్' పోటీలలో షివిన్ భారతదేశం తరవున పాల్గొన్నాడు. మన దేశం తరవున అతనితో పాటు మరొక ముగ్గురుకూడా పాల్గొన్నారు. ఆ పోటీలలో పాల్గొన్న 18 దేశాలకు చెందిన క్రీడాకారులందరిలోకి అతి పిన్న వయస్కుడు షివిన్! అందుకే ఒక ఇటలీ వార్తాపత్రిక షివిన్‌ను 'పికొల్లో' (అతి పిన్న వయసు) క్రీడాకారుడని వర్ణించి అతని అద్భుత ప్రతిభను శ్లాఘించింది!

న్యూఢిల్లీలో జరిగిన 13 వ ఆసియా పసిఫిక్ జూనియర్ ఛాంపియన్ షిప్ పోటీలలో షివిన్ రజత పతకాన్ని (పన్నెండేళ్ళ లోపువారికి) గెలుచుకున్నాడు. ఫిలిప్పైన్స్‌కు చెందిన జానన్‌గిరొనెల్లా ప్రథమ స్థానం సాధించాడు. అయినా షివిన్ కూడా తన ఆటతో చూపరులను ఆనందింపజేశాడు. జూలైలో జరుగనున్న 'శాన్ డీగో వరల్డ్ జూనియర్ ఛాంపియన్‌షిప్' పోటీలలో షివిన్ పాల్గొననున్నాడు.

కలకత్తాలో జరిగిన నేషనల్ గోల్ఫ్ ఛాంపియన్ షిప్ పోటీలలో షివిన్ నేషనల్ సబ్ జూనియర్ (పదిహేనేళ్ళ లోపు)గా వచ్చాడు. దానిని సాధించిన అతి పిన్న వయస్కుడు షివిన్!

# మీకు తెలుసా?

1. మన దేశానికి చెందిన రెండవ అతి ప్రాచీనమైన గ్రంథం ఏది ?
2. పరశురాముడు ఏ వంశంలో జన్మించాడు ?
3. ఏసుక్రీస్తు, జూడాస్ చేత మోసగించబడిన ఉద్యానవనం ఏది ?
4. 'భారత జాతీయ కాంగ్రెస్' మొట్టమొదటి పేరు ఏమిటి ?
5. భారత ఉపరాష్ట్రపతి పదవిని పదేళ్ళపాటు నిర్వహించిన వారెవరు ?
6. చక్రవర్తి హర్షవర్ధనుడు ఒక మంత్రి చేత చంపబడ్డాడు. ఆ మంత్రి పేరేమిటి ?
7. శక సంవత్సరం ఎప్పుడు ఆరంభమయింది ? అది దేనిని గుర్తు చేస్తుంది ?
8. పురాణాల ప్రకారం మహావిష్ణువు మొసలినుంచి రక్షించిన ఏనుగు పేరేమిటో తెలుసా ?
9. 'జూలియన్ క్యాలెండర్' ను రూపొందించినవారని ఎవరిని చెబుతారు ?
10. ఉత్తర భారత దేశంలోని 'భాయిదూజ్' పండుగలాగే దక్షిణాదిలోనూ ఒక పండుగను జరుపుకుంటారు. దాని పేరేమిటో తెలుసా ?
11. ఒక సుప్రసిద్ధమైన ఆటను ఒకప్పుడు 'పూనా' అని పిలిచేవారు. ఆ ఆట పేరేమిటి ?
12. కలకత్తాలోని ఒకజాతి ప్రజలు 'పావురాలపందెం'పట్ల అభిమానం చూపుతారు. వాళ్లు ఎవరు ?
13. సుప్రసిద్ధమైన 'హర్షచరిత్ర' ను రచించిన వారెవరు ?
14. 'నాగార్జునసాగర్' ఆనకట్ట ఏ నదికి అడ్డుగా నిర్మించబడి ఉన్నది ?
15. మహాబలిపురాన్ని నిర్మించిన వారెవరు ?

## సమాధానాలు

1. యజుర్వేదం.
2. భృగువంశం.
3. గెత్సెమేన్.
4. ఇండియన్ నేషనల్ యూనియన్.
5. డా॥ ఎస్. రాధాకృష్ణన్.
6. అర్జునుడు.
7. క్రీ॥ శ॥ 78 లో. కనిష్కుడి పట్టాభిషేకం.
8. గజేంద్రుడు.
9. జూలియస్ సీజర్. క్రీ. పూ. 46 వ సం॥ నెలల పేర్లూ, సంవత్సరాల పేర్లూ ప్రవేశపెట్టాడు.
10. 'కానుపొంగల్'.
11. బాడ్మింటన్.
12. చీనాదేశస్థులు.
13. బాణభట్టుడు.
14. కృష్ణానది.
15. నరసింహ వర్మ.

# చందమామ కబుర్లు



## అంతరిక్షంలో రికార్డులు !

రష్యాకు చెందిన వ్యోమగాములు 'ఎం. ఐ. ఆర్' అంతరిక్ష నిలయంలో నెలలతరబడి గడిపారు. అయితే అంతరిక్షం నుంచి గత మేనెలలో తిరిగి వచ్చిన అమెరికాకు చెందిన 'ఎండవర్' అనే 'స్పేస్ షటిల్' లో అంతరిక్షానికి వెళ్ళి వచ్చిన కమాండర్ డాన్ బ్రాండెన్‌స్టీన్ 740 గంటలు, అంటే దాదాపు 31 రోజులు 'స్పేస్ షటిల్' లో గడిపి కొత్త రికార్డును సృష్టించారు. ఆయన నాలుగు సార్లు అంతరిక్షానికి వెళ్ళివచ్చారు. అంతకు పూర్వం నార్మ్ థగార్డ్, 604 గంటలు 'స్పేస్ షటిల్' లో గడిపారు. ఆయన కూడా నాలుగుసార్లు అంతరిక్షంలోకి వెళ్ళివచ్చారు !

## నగరాలబాంధవ్యం!

విభిన్న నగర ప్రజలమధ్య సోదరభావం పెంపొందించడానికి వీలుగా ఒక పథకం రూపొందించారు. ఈ పథకం ప్రకారం అమెరికా కొలొరాడోలోని డెన్వర్ నగరానికి ఎనిమిది బాంధవ్య నగరాలు ఉన్నాయి. వీటిలో ఎనిమిదవది మద్రాసు నగరం. డెన్వర్ నగర ప్రజలకు మద్రాసును గురించి తెలియజేయడానికి, త్వరలో అక్కడ 'డెన్వర్ మద్రాస్ పార్క్' ను నిర్మించనున్నారు.





# మూటలో మనిషి

సిరిపురం అనే ఊళ్ళో నరహరి అనే సంపన్న గృహస్థుడుండేవాడు. ఒకరోజు ఆయనను చూసి పోదామని, అతడి చిన్ననాటి స్నేహితుడైన శ్రీహరి అతడింటికి వచ్చాడు. వాళ్ళిద్దరూ కలుసుకుని చాలా రోజులయింది.

నరహరి, శ్రీహరి దుస్తుల తీరూ అదీ చూసి, అతడు బీదరికం అనుభవిస్తున్నాడనీ, ఏదో అవసరం వుండి తనతో మాట్లాడడానికి వచ్చాడనీ గ్రహించాడు. అయితే, అతడు వచ్చిన పనేమిటో అడగకుండా, తానెంత డబ్బు సంపాయించిందీ, తనకెలాంటి పెద్దవాళ్ళతో, ధనికులతో పరిచయాలున్నదీ అదేపనిగా చెప్పడం మొదలుపెట్టాడు.

శ్రీహరి, నరహరి చెబుతున్నదంతా ఓపికగా వింటూండగా, ఎవరో ఒకతను లోపలికి వచ్చి, నరహరికి నమస్కారం పెట్టి, ఒక చీటీ అతడి చేతికిచ్చి వెళ్ళిపోయాడు.

నరహరి ఆ చీటీ చదువుకుని గర్వంగా శ్రీహరికేసి చూస్తూ, ''చూశావా, నా పలుకుబడి! ఈ రాత్రి జమీందారింట్లో విందు జరుగుతున్నది. నన్ను రమ్మనమని స్వయంగా ఆయన రాసిపంపిన ఆహ్వానమిది,'' అన్నాడు.

శ్రీహరి నవ్వి, "నీ గొప్పతనమెలాంటిదో, నువ్వు సంపాయించిన డబ్బు మూటల గురించి చెబుతున్నప్పుడే గ్రహించాను. నిజానికి నేను జమీందారుతో పనుండి వచ్చినవాడినే. నువ్వు నాకాయన దర్శనం చేయించగలవన్న గట్టి నమ్మకంతో నే వచ్చాను,'' అన్నాడు.

నరహరి పరిహాసమాడుతున్నవాడిలా, ''జమీందార్లంత వాళ్ళతో, నీకేం పని?'' అని అడిగాడు.

జొన్నలగడ్డ రత్న



"అవును, చాలా ముఖ్యమైన పని పడింది మరి! మీ ఊరు జమీందారుకు, మా ఊళ్ళో కొన్ని బీడు పొలాలున్నాయి. ఇప్పుడు వాటిని సాగుచేయించాలనే ఉద్దేశ్యంతో ఆయనున్నట్టు తెలిసింది. నువ్వొక్క మాట నా గురించి, ఆయన చెవినవేసి, నాకా పొలాలు కౌలుకు ఇప్పించు," అన్నాడు శ్రీహరి.

ఇందుకు నరహరి అయిష్టంగా ముఖం పెట్టి, "నువ్వేమీ అనుకోనంటే, ఒకమాట చెబుతాను. మా జమీందారు మనుషుల మధ్య అంతుస్థుల గురించి బాగా పట్టింపున్నవాడు. అసలు నిజం చెప్పాలంటే—నాకు, నీలాంటి స్నేహితులున్నారని తెలియడం ఆయనకు ఇష్టం వుండదు," అన్నాడు.

అయినా శ్రీహరి ఊరుకోక, తను చాలా ఇబ్బందుల్లో వున్నాననీ, ఏదో విధంగా జమీందారుకు నచ్చచెప్పి, ఆ బీడుపొలాలు తనకు కౌలుకు ఇప్పించమనీ ప్రాధేయపడుతున్నట్టు అడిగాడు.

కాని నరహరి నిర్లక్ష్యంగా, "పొద్దుకు వేళయిపోతున్నది. రేపు ఒకసారి వచ్చి కనబడు. తీరిగ్గా మాట్లాడుకుందాం," అని శ్రీహరిని పంపించివేశాడు.

మర్నాడు శ్రీహరి, నరహరిని కలుసుకోవడానికి వెళ్ళినప్పుడు, అతడెవరితోనో మాట్లాడుతున్నాడు. నరహరి ఆ కొత్తవాణ్ణి శ్రీహరికి పరిచయం చేస్తూ, "ఈయన వరాలయ్య. ఈ ఊళ్ళోకల్లా పెద్ద షావుకారు. రోజూ వచ్చి నాతో కొంతసేపు మాట్లాడి వెళ్ళకపోతే, ఈయనకు తోచదు," అన్నాడు.

వరాలయ్య, శ్రీహరి కేసి ఒకసారి ఎగాదిగా చూసి, నరహరితో, "ఏమిటీ! ఈ మూటలు మోసే మనిషితో, నీకు బాగా పరిచయం వున్నట్టున్నదే!" అన్నాడు.

నరహరి ఆశ్చర్యపోతూ, "ఈయన పేరు శ్రీహరి. చిన్నప్పుడు నాతో వీధిబడిలో చదువుకున్నాడు. ఆచనువుకొద్దీ అప్పుడప్పుడూ వచ్చిపోతూంటాడు. ఈయన

మూటలు మోయడమేమిటి?'' అని ప్రశ్నించాడు.

దానికి వరాలయ్య తల అడ్డంగా తిప్పుతూ, ''అదంతా నాకు తెలియదు. నిన్నరాత్రి నేను దుకాణం కట్టేసి ఇంటికి వెళ్ళబోతూ, ఎవరో స్నేహితులు పంపిన రెండు మామిడిపళ్ళ బుట్టల్ని, ఇంటి దాకా మోయించుకుపోవాలని మనిషి కోసం చూస్తున్నాను. ఆ సమయంలో ఇతను ఏదో పెద్ద గోతాన్ని భుజాన వేసుకుని వెళుతూ, అంగడి వీధిలో కనిపించాడు. నేనప్పుడితన్ని—ఆ మూటేదో దింపేసి వచ్చాక, ఈ పళ్ళబుట్టల్ని కాస్త మా ఇంటికి చేర్చిపెడతావా? అని అడిగాను. అయితే ఇతను నాకేసి అదోలా చూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. అందువల్లే, ఇప్పుడు సులభంగా గుర్తుపట్టాను!'' అంటూ నరహరికి వస్తానని చెప్పి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

వరాలయ్య వెళ్ళగానే నరహరి, శ్రీహరి కేసి చీదరించుకుంటున్నట్టు చూస్తూ, ''ఇలాంటి తక్కువమాలిన పనులు చేయడానికి, నీకు అవమానం అనిపించలేదా? అడిగితే నేనే పదో పరకో పడేసి వుండేవాడిని కదా? మూటలు మోసుకుని బతికే స్నేహితుడున్నాడని చెప్పుకోడానికి, నాకు చాలా సిగ్గుగా వుంది. దయచేసి



ఇకముందేనాడూ, నా గుమ్మం తొక్కకు,'' అన్నాడు.

శ్రీహరి చిన్నగా నవ్వి, ''ఏం చేస్తాను, అలా మూట మొయ్యక తప్పలేదు, మరి ఆ మూటలో వున్నది నువ్వే కదా!'' అన్నాడు.

నరహరి కోపంగా, ''మూటేమిటి? అందులో నేనుండడమేమిటి?'' అని పెద్దగా అరిచాడు.

శ్రీహరి అతడి కేసి శాంతపడమన్నట్టు చెయ్యూపి, ''నేను చెప్పేది సాంతం వింటే బావుంటుంది. నిన్నరాత్రి నేను మా ఊరికి తిరుగుప్రయాణమై పోతూండగా, జమీందారు మేడ ముందు కుప్పలా

కూలివున్న నువ్వు కనిపించావు. అందుకు కారణం, జమీందారింట్లో అతిగా పుచ్చుకున్న మత్తుపానీయాలేనని, నాకర్థమైంది! నీ అంతకలవాణ్ణీ, గొప్ప స్నేహాలున్నవాణ్ణీ, అటువంటి స్థితిలో ఎవరైనా చూడడం బావుండదు కదా? అందుకని, నిన్ను ఎవరికంటా పడకుండా గోతాంలోకి ఎక్కించి, వీపు మీద మీ ఇంటికి మోసుకు వచ్చి పడేశాను. జరిగింది అంతేలే," అన్నాడు.

గుడిలో పూజ చేయించి, ప్రసాదంతో తిరిగివచ్చి, వాకిట్లో నిలబడి, ఈ సంభాషణ అంతా విన్న నరహరి భార్య కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ భర్తతో, "మీ స్నేహితుడు చెప్పిందాంట్లో అవగింజంతయినా అసత్యం లేదు. మిమ్మల్ని ఆ స్థితిలో చూసి మనస్సు వికలమై, రాత్రంతా నేను నిద్రపోలేదు. సూర్యోదయంతోనే గుడికి వెళ్ళి, ఇప్పటిదాకా అమ్మవారి సన్నిధిలో కూర్చునివస్తున్నాను. మీ పరువు ఈయన నిలబెట్టి వుండకపోతే, ఈ పాటికి ఇరుగూ—పొరుగూ మనల్ని చూసి నవ్వుకుంటూండేవాళ్ళు. ఒకవేళ జమీందారుగారుగానీ, ఆయన సన్నిహితులుగానీ మిమ్మల్ని ఆ స్థితిలో చూసివుంటే ఏమయేది? ఒక తాగుబోతుతో ఇన్నాళ్ళుగా స్నేహం చేస్తున్నామని బాధపడేవాళ్ళు. మీరు దివాణం కేసి తల ఎత్తి చూడడానికైనా అర్హులు కారని భావించేవాళ్ళు," అన్నది.

ఇది విని నరహరి తల వంచుకుని, శ్రీహరితో, "నా అహంకారానికీ, ఆడంబరానికీ తగిన శాస్తి జరిగింది. నా పరువు గంగపాలు కాకుండా భద్రంగా మూటలో కట్టి, ఇంటికి తెచ్చి పడేశావు! ఈనాటి నుంచీ, పరువు ప్రతిష్ఠల్ని సర్వనాశనం చేసే ఈ దురలవాటుకు దూరంగా వుంటానని, బాల్యమిత్రుడివైన నీ ముందు ప్రమాణం చేస్తున్నాను," అని స్నేహితుణ్ణి అభినందించి స్వయంగా శ్రీహరిని జమీందారు దగ్గిరకు తీసుకువెళ్ళి, అడిగిన భూముల్ని కౌలుకిప్పించాడు.





# పండితుడి విలువ

చందనపుర గ్రామంలో కుశలుడనే పండితుడుండేవాడు. ఆ గ్రామంలో శ్రమజీవులూ, వ్యాపారస్థులూ ఎక్కువగా వున్నందువల్ల, ఆయన పాండిత్యాన్ని గుర్తించేవారెవ్వరూ లేకపోయారు. అందువల్ల కుశలుడికి కొన్నాళ్లకు రోజు గడవడమే కష్టమయింది. మరేపనీ చేయలేని కుశలుడు ధన సహాయం కోసం రాజును కలుసుకోవాలని రాజధాని చేరుకున్నాడు.

ఎంత ప్రయత్నించినా కుశలుడికి రాజదర్శనం కాలేదు. ఆ సమయంలో అదృష్టవశాత్తూ ఆయనకు చతురుడు తటస్థపడ్డాడు. చతురుడిది కూడా చందనపుర గ్రామమే! వాడు, కుశలుడు చిన్ననాటి స్నేహితులు. కష్టపడి పని చేయలేక, వర్తకంచేయడం ఇష్టం లేక వాడు పదేళ్ళ క్రితం గ్రామం విడిచి రాజధానికి చేరుకున్నాడు. వాడికి నలుగురినీ మంచి చేసుకొనడం వెన్నతో పెట్టిన విద్య. ఆ విధంగా వాడు రాజు కొలువులో ఉద్యోగం సంపాయించడమే కాక, క్రమంగా రాజుకు దగ్గరవాడు కూడా అయ్యాడు.

వాడు కుశలుడి విషయం తెలుసుకుని, "నేను నీకు రాజదర్శనం కలిగిస్తాను. కానీ ఆయన్ని మెప్పించడం మాత్రం నీ వంతు," అన్నాడు.

కుశలుడు సరేనన్నాడు.

మరునాడే కుశలుడికి రాజదర్శనమయింది. రాజు, కుశలుడి పాండిత్యానికి అబ్బురపడి, తన ఆస్థానంలో వుండిపొమ్మన్నాడు. అందుకు కుశలుడు, రాజుతో, "మహారాజా! నాకు చందనపురం విడిచి రావాలనిలేదు. తమరు ధన సహాయం చేస్తే, అక్కడే కొంత పొలం కొనుక్కుని, వ్యవసాయం చేయించుతూ బ్రతకాలనుకుంటున్నాను," అన్నాడు.

శ్రీ రామకమల్




రాజు, చతురుడివద్ద కుశలుడి నెంత గానో మెచ్చుకుని, "నా కొలువులో చేరాక నువ్వు చేసిన పనుల్లో నన్నెక్కువగా సంతోషపెట్టిన విశేషం, కుశలుడి పరిచయమే!" అన్నాడు.

ఆ తర్వాత ఆయన తరచుగా చతురుడి వద్ద కుశలుణ్ణి పొగుడుతుండేవాడు.

చతురుడికిది ఇబ్బందిగా తోచింది. కుశలుడంటే రాజింతగా ఇష్టపడగలడని వాడనుకోలేదు. పదేళ్ళుగా రాజు కొలువు చేస్తున్నా, రోజులు సుఖంగా గడిచిపో తున్నాయే తప్ప, వాడివద్ద డబ్బెక్కువ నిల్వలేదు. ఒక్కపూటలో యాభైవేల వరహాలు సంపాయించిన కుశలుడంటే, వాడిలో అసూయ బయల్దేరింది. అందు వల్ల వాడు తెలివిగా రాజు మనసులో కుశలుడిపట్ల విరక్తి కలిగించాలని, "ప్రభూ! నేను కుశలుణ్ణి తమకెప్పుడో పరిచయం చేసివుండేవాణ్ణి. కానీ చిన్న తనంనుంచీ వాడు అహంకారి. రాజ దర్శనానికి రమ్మంటే నిరాకరించేవాడు. ఇప్పుడు పూట గడవక మీ వద్దకు వచ్చాడు కానీ, కాస్త కడుపునిండితే మళ్ళీ తమ దర్శనానికి రాడు." అన్నాడు వాడొక రోజున రాజుతో.

రాజు, కుశలుడికి యాభైవేల వరహా లిచ్చి, "నావద్ద రాజనీతిపై పురాతనగ్రంథ మొకటున్నది. చాణక్యుడి అర్థశాస్త్రంలో కూడా లేని విశేషాలెన్నో ఇందులో వున్నా యంటున్నారు. అయితే అందులోని భాష నర్మగర్భంగా వుండి, ఆస్థాన పండితు లెవ్వరూ సరైన వ్యాఖ్యానం చెప్పలేక పోతున్నారు. పండితులకేగాక, సామాన్య ప్రజలకు కూడా అర్థమయ్యే విధంగా ఆ గ్రంథాన్ని ఏడాదిలోగా తమరు వ్యాఖ్యా నించి ఇస్తే, తమకు మరొక యాభైవేల వరహాలిచ్చి సత్కరించగలను," అన్నాడు.

కుశలుడా గ్రంథాన్ని తీసుకుని చందన పురం వెళ్ళిపోయాడు.

రాజీమాటలు విని చతురుడివద్ద మళ్ళీ కుశలుడి ప్రస్తావన తీసుకురాలేదు.

ఈ విధంగా ఆరు మాసాలు గడిచాయి. ఒకరోజున రాజు, చతురుడితో, ''నేనిచ్చిన గ్రంథాన్ని కుశలుడెలా వ్యాఖ్యానిస్తున్నాడో తెలుసుకోవాలనివుంది. ఒకసారి ఆయనకు కబురు పంపి రప్పించగలవా?'' అన్నాడు.

ఇదే మంచి అదననుకున్నాడు చతురుడు. వాడు కుశలుడి కేకబురూ పంపకుండా, రెండు రోజుల అనంతరం రాజును కలుసుకుని, ''ప్రభూ! ఇప్పట్లో తనకు మిమ్మల్ని కలుసుకునేందుకు రావడం వీలుపడదన్నాడు, కుశలుడు,'' అని చెప్పాడు.

అయితే చతురుడనుకున్నట్లు రాజు మండిపడలేదు. ఆయన వెంటనే, ''అవును, పొరబాటు నాదే! ఏడాది వ్యవధి ఇచ్చాను. మధ్యలో పండితుడి ఏకాగ్రతను భంగం చేయడం నాకు తగని పని. నేనే. ఆయనవద్దకు వెళ్ళి తీరిక సమయంలో ఆయన కృషి గురించి తెలుసుకోవడం న్యాయం. రేపే మనం చందనపురం వెళుతున్నాం!'' అన్నాడు.

అలా చేస్తే, తన బండారం బయటపడుతుందని భయపడిన చతురుడు, ''ప్రభూ! నేనే స్వయంగా వెళ్ళి కుశలుణ్ణి ఒప్పించి తీసుకువస్తాను,'' అని చెప్పి చందనపురానికి బయలుదేరాడు.

వాడు, కుశలుడి ఇంటికి వెళ్ళి ఆయనతో, ''నీ గొప్పతనం నాకిప్పుడర్థమయింది, నీ పాండిత్యానికి, రాజుకు నీ పట్ల గల అభిమానానికి అసూయపడి



పీకలమీదికి తెచ్చుకున్నాను!'' అని, తను రాజుతో ఆడిన అబద్ధం గురించి చెప్పి, ''రాజుకు అసలు విషయం తెలిస్తే నా ఉద్యోగం ఊడుతుంది. నేను కారాగారం పాలవుతాను. నువ్వే నన్ను కాపాడాలి,'' అన్నాడు.

''నిన్ను నేను కాపాడాలంటే ఒక్కటే మార్గముంది. ఇప్పుడు కూడా నేను రాజదర్శనానికి రానన్నానని రాజుతో చెప్పు. ఆ విధంగా నీ మాట నిజమవుతుంది. రాజు నన్నేం చేస్తాడో చూద్దాం,'' అన్నాడు కుశలుడు.

చతురుడు, మిత్రుడి విశాల హృదయాన్నర్థం చేసుకుని, మరొకసారి తన తప్పులు మన్నించమని వేడుకుని తిరుగు ప్రయాణమయ్యాడు. అయితే గ్రామ పొలిమేరల్లోనే వాడికి రాజుగారి రథం ఎదురయింది.

వాడు, రాజుతో, ''ప్రభూ! కుశలుడికి రాజధానికి వచ్చేందుకు తీరుబాటు లేదట. ఆ సంగతి తమకు చెప్పమన్నాడు,'' అన్నాడు.

రాజు చిరునవ్వు నవ్వి, ''నీ మిత్రుడు అహంకారి కాదు. నేనప్పగించిన పనిని ఎంతో శ్రద్ధగా చేస్తున్నాడు. అందుకే కబురు చేస్తే మధ్యంలో రానన్నాడు. నీవు వెళ్ళినా రానంటాడని నాకు ముందే తెలుసు. అందుకే నేను స్వయంగా వచ్చాను,'' అన్నాడు.

తర్వాత రాజు చందనపురంలో కొన్నాళ్ళుండి, పండితుడి సాంగత్యంలో గడిపి తృప్తిగా రాజధానికి తిరిగివెళ్ళాడు.

జరిగినది చూసిన చందనపురం గ్రామస్థులకు ఒక విషయం స్పష్టమయింది. చతురుడి వంటి వాళ్ళు ఏళ్ళ తరబడి రాజు కొలువులో పనిచేసినా సొంతలాభం మాత్రమే చూసుకోగలరు. కుశలుడివంటి పండితులవల్లనే గ్రామానికి కీర్తి ప్రతిష్ఠలు వస్తాయి!

ఇది అర్థం కాగానే గ్రామస్థులు కుశలుడిని గౌరవించటమే కాక, అప్పటి నుంచీ కళల నాదరించడం అలవర్చుకున్నారు.






మహోదరుడు అలా అన్న మీదట కుంభకర్ణుడు రాక్షసుల వెంట రావణుడి ఇంటికి వెళ్ళాడు. రాక్షసులు ముందుగా రావణుడి వద్దకు వెళ్ళి, "కుంభకర్ణుడు నిద్ర లేచాడు. అతనికి ఏం అజ్ఞ ఇస్తావు? అలాగే యుద్ధానికి పొమ్మన్నావా? ఇక్కడికి వచ్చి నిన్ను చూడమన్నావా?" అని అడిగారు.

"నేను కుంభకర్ణుణ్ణి చూడాలి, అతన్ని గౌరవంగా ఇక్కడికి తీసుకురండి." అన్నాడు రావణుడు.

రాక్షసులు వెళ్ళి ఈ మాట చెప్పగానే కుంభకర్ణుడు రావణుడి వద్దకు వచ్చాడు.

కుంభకర్ణుణ్ణి ప్రాకారాల వెలుపల ఉన్న వానరులు చూసి భయపడి, అటూ ఇటూ పరిగెత్తారు. కుంభకర్ణుణ్ణి రాముడు కూడా చూశాడు. వానరసేన పరిగెత్తటమూ చూశాడు. అతను విభీషణుడితో, "పెద్ద మేఘంలాగున్నాడు. ఎవరితడు?" అన్నాడు.

విభీషణుడు రాముడితో ఇలా అన్నాడు:

"ఇతను విశ్రవసుడి కొడుకు కుంభకర్ణుడు. యుద్ధంలో యముణ్ణీ, ఇంద్రుణ్ణీ కూడా జయించినవాడు. ఇతని దేహమంత పెద్ద దేహం మరే రాక్షసుడికీ లేదు. ఇతర రాక్షసులు వరాలు పొంది బలవంతులయ్యారు కాని, కుంభకర్ణుడు పుట్టుకతోనే మహాపరాక్రమశాలి. ఇతను పుట్టుతూనే అకలికొద్దీ అనేకవేల ప్రాణులను భక్షించాడు. ఇది చూసి ప్రజలు బెదిరిపోయి



ఇంద్రుడితో చెప్పి, అతని శరణు జొచ్చారు. ఇంద్రుడు కోపించి, కుంభకర్ణుణ్ణి వజ్రాయుధంతో కొట్టాడు. కుంభకర్ణుడు సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి ప్రజలు మరింత హడలిపోయారు. కుంభకర్ణుడు ఐరావతం దంతం ఒకటి పీకి, దానితో ఇంద్రుణ్ణి రొమ్ములో పొడిచాడు. తరవాత ఇంద్రుడు ప్రజలను వెంటబెట్టుకుని బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పుకున్నాడు. బ్రహ్మదేవుడు రాక్షసులనందరినీ పిలిపించాడు. వారిలో కుంభకర్ణుడు కనిపించేసరికి బ్రహ్మకే భయం పుట్టింది. బ్రహ్మ కుంభకర్ణుడితో, 'లోకాలు నాశనం చెయ్యటానికి విశ్రవసుడు నిన్ను కన్నాడురా! నువ్వు సర్వకాల సర్వావస్థలయందూ ఒళ్ళు తెలియకుండా పడి ఉండి నిద్రపో!' అన్నాడు.

ఆ శాపం తగిలి కుంభకర్ణుడు బ్రహ్మ ఎదటనే పడిపోయాడు. అది చూసి రావణుడు బ్రహ్మతో, 'నీ మునిమనమడయిన ఈ కుంభకర్ణుణ్ణి ఇలా శపించటం భావ్యం కాదు. నీ మాట అబద్ధం కావటానికి లేదు. వాడు నిద్రపోవటానికీ, మేలుకుని ఉండటానికీ కాల నియమం ఏర్పాటు చెయ్యి.' అన్నాడు. అప్పుడు బ్రహ్మ కుంభకర్ణుడు ఆరు మాసాలు నిద్రపోయేటట్టూ, ఒక్కరోజు మేలుకుని ఇండేటట్టూ, నిద్ర లేచినప్పుడు ఆకలితో ఎదట కనిపించినదంతా అగ్నిహోత్రుడిలాగా తినేటట్టూ నియమం పెట్టాడు.

"నీ పరాక్రమానికి బెదిరిపోయి, రావణుడు కుంభకర్ణుణ్ణి నిద్ర లేపించాడు. మహాభయంకర పరాక్రముడైన కుంభకర్ణుడు వానరులను తినటానికి వస్తాడు. వానరులు అతన్ని ఎలా ఎదిరించగలరు? అది ఒక కదిలే యంత్రమని వానరులకు చెప్పాలి. అప్పుడుగాని వారి భయం పోదు."

రాముడు విభీషణుడు చెప్పినది విని తృప్తిపడి, నీలుడితో లంకా ద్వారాలన్నిటిపైనా దాడి సాగించమన్నాడు. గవాక్షుడూ,



హనుమంతుడూ, అంగదుడూ పర్వత శిఖరాలను తీసుకుని యుద్ధానికి వచ్చారు.

ఈ లోపల కుంభకర్ణుడు పూర్తిగా వదలని నిద్రమత్తుతో రావణుడి వద్దకు వచ్చి, అతను విచారంగా ఉండటం గమనించాడు. కుంభకర్ణుణ్ణి చూసి రావణుడు పరమానందంతో ఆసనం నుంచి లేచి, కుంభకర్ణుణ్ణి కౌగలించుకుని, ఇద్దరూ కూర్చున్న అనంతరం, కుంభకర్ణుడు, "ఏం తొందర కలిగింది? నిద్రపోతున్న నన్ను ఎందుకు లేపించావు? నీ కిప్పుడు ఎవడు భయం కలిగించాడు? వాడికి చావు దగ్గిరపడింది!" అన్నాడు.

దానికి రావణుడు, "నాకు రాముడి వల్ల భయం కలిగింది. అతను సుగ్రీవుడితోనూ, వానరసేనతోనూ, సముద్రం దాటి వచ్చి, మనని సర్వనాశనం చేస్తున్నాడు. యుద్ధంలో వానరవీరుడు ఒక్కడూ చావలేదు గాని, వానరుల చేతిలో రాక్షస వీరులు చాలామంది చచ్చారు. అందుచేత ఇప్పుడు నువ్వు వానరులనందరినీ చంపి, లంకను కాపాడు. అందుకే నిన్ను నిద్ర లేపాను," అన్నాడు.

కుంభకర్ణుడు నవ్వి, "ముందు మనం సమాలోచన చేసినప్పుడు ఎలా జరుగుతుందనుకున్నామో, అలాగే జరిగింది. సీతను అపహరించి తెచ్చిన పాపానికి ఫలితం వెంటనే కనబడింది. ఈ విషయంలో మన తమ్ముడు విభీషణుడు చెప్పినదే మనకు హితమైనది. లేదా, నీకు ఇంకేమైనా తోస్తే అలా చెయ్యి," అన్నాడు.

రావణుడు కోపంగా "నా కన్న చిన్నవాడివి నాకు బోధలు చేస్తున్నావేమిటి? ఇది నీతి గురించి ఆలోచించే సమయం కాదు. పరాక్రమం చూపే సమయం," అన్నాడు.

దానికి కుంభకర్ణుడు, "రాక్షసరాజా, నేను నీకు తమ్ముణ్ణి, బంధువును. నీకు హితం చెప్పటం నా విధి. ఇక నీకు



కలిగిన విచారం మాటకు వస్తే నువ్వు నిశ్చింతగా ఉండు. రామలక్ష్మణులను చంపి, వానరసేన పారిపోయేటట్టు చేస్తాను. తమ బంధువులు పోయినందుకు దుఃఖించే రాక్షసులందరికీ సంతోషం కలిగిస్తాను. నేను బతికి ఉండగా రాముడు నిన్ను చంపలేడు,'' అన్నాడు.

మహోదరుడు కుంభకర్ణుణ్ణి మందలిస్తూ ఇలా అన్నాడు :

''రావణుడు సీతను ఎత్తుకువద్దామనుకున్నప్పుడు అందుకు మేమంతా అమోదించాం. ఎవరి హితమూ వినకుండా రావణుడు ఆ పని చెయ్యలేదు. నువ్వు, ఇప్పుడు నీ పరాక్రమం గొప్పగా చెప్పుకుని, ఒక్కడివే యుద్ధానికి పోతానంటున్నావు. అది కూడా సముచితంగా లేదు. జనస్థానంలో అనేకమంది రాక్షసులను ఒంటరిగా చంపిన రాముణ్ణి నువ్వు ఒక్కడివే ఎలా చంపుతావు? ఆ జనస్థానంలో రాముడికి ఓడిన మహాపరాక్రమవంతులైన రాక్షసులు ఇప్పటికీ రాముడి పేరు చెబితే భయపడుతున్నారు, చూడు.''

తరవాత మహోదరుడు రావణుడితో, ''నువ్వు మమ్మల్ని కొందరిని యుద్ధానికి పంపు. మేం రాముణ్ణి చంపితే సరేసరి. లేకపోతే తిరిగివచ్చి, రాముణ్ణి తినేశామని చెబుతాం. నువ్వు బహిరంగంగా పండగ జరుపు. సీతను భర్త పోయినందుకు పరామర్శించు. నీదాన్ని చేసుకో. యుద్ధంతో పనేలేకుండా నీ కోరిక తీరిపోతుంది!'' అన్నాడు.

మహోదరుణ్ణి చూస్తే కుంభకర్ణుడికి మండిపోయింది. అతను మహోదరుడితో, ''ఇలాటి మాటలు ఇంకెన్నడూ చెప్పకు. జాగ్రత్త! పిరికివాళ్ళూ, బుద్ధిహీనులూ అయిన నీలాటివాళ్ళ మాటలు వినటం చేతనే రావణుడికి ఈ ఆపద వచ్చిపడింది. మీకు యుద్ధమంటేనే భయం. రాజు చెప్పిన దానికంతకూ తాళం వేస్తూ, ఇచ్చకాలాడటంమూలాన వ్యవహారం ఇంతదూరం వచ్చింది. మీ మూలంగా



వానరులు పారిపోతారు; రామలక్ష్మణుల గుండెలు పగిలిపోతాయి,'' అన్నాడు.

కుంభకర్ణుడు యుద్ధానికి పోవటానికి సిద్ధపడుతూ, మంచి వాడి గల శూలాన్ని చేపట్టాడు. అది ఇనుముతో చేసినది. దానికి మెరిసే బంగారు అలంకరణ లున్నాయి. ఆ శూలాన్ని చేబట్టి కుంభ కర్ణుడు రావణుడితో, ''నేను ఒంటరిగానే పోతాను. నా సేనను ఇక్కడే ఉండనీ, నన్ను చూసి భయపడిన వానరుల నందరినీ తినేస్తాను,'' అన్నాడు.

''సాయుధ సైనికులను వెంటబెట్టుకుని వెళ్ళు. వానరులు చాలా పరాక్రమ వంతులు, వేగవంతులు, పట్టుదల గల వాళ్ళు. ఒంటరిగా, ఏమరుపాటున ఉన్న వాణ్ణి చంపెయ్యగలరు,'' అన్నాడు రావణుడు.

అతను కుంభకర్ణుణ్ణి తన చేతుల మీదుగా అలంకరించాడు. కుంభకర్ణుడు కవచం ధరించి, రావణుణ్ణి కౌగలించు కుని, రావణుడి ఆశీర్వాదం పొంది, యుద్ధానికి బయలుదేరాడు. అతని వెంట రథాలమీద అనేకమంది, సైన్యంతో సహా, శంఖాలూ, భేరీలూ మోగిస్తూ బయలు దేరారు.

దారిలో కుంభకర్ణుడు రాక్షసులతో, ''వానరులు మన కేమీ అపకారం చెయ్య

లంక దాదాపు నాశనమయింది. బొక్కసం ఖాళీ అయింది. సైన్యమంతా తుడిచి పెట్టుకుపోయింది. మీరు రాజును శత్రు వుగా చూసినట్టున్నది. మీరు చేసిన తప్పులు సరిచెయ్యటానికి నేను యుద్ధ భూమికి పోతున్నాను,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలకు రావణుడు పకపకా నవ్వి, ''మహోదరుడికి రాము డంటే భయం. అందుకే యుద్ధం వద్దం టాడు. నాకు నీ కన్న దగ్గిరవాడూ; నీ అంత బలవంతుడూ మరొకడు లేడు. నువ్వు వెంటనే యుద్ధానికి బయలుదేరు, వానరులను భక్షించు, యుద్ధంలో జయం పొందిరా. అసలు నిన్ను చూస్తూనే

లేదు. కోతులు వనాలకు అలంకారంగా కూడా ఉంటాయి. ఇప్పుడు వానరులు లంకను ముట్టడించటానికి కారణం రామ, లక్ష్మణులు. అందుచేత యుద్ధంలో వారి ఇద్దరినీ చంపేస్తాను,'' అన్నాడు.



కుంభకర్ణుణ్ణి చూడగానే వానరసేన చెల్లాచెదురుగా పారిపోయింది. అది చూసి కుంభకర్ణుడు చాలా సంతోషించాడు.

అంగదుడు వానరుల భయం గమనించి, నల, నీల, గవాక్ష, కుముదులతో ''మీరు మీ స్వరూపాలనూ, పరాక్రమాలనూ, వంశాలనూ మరచి, మామూలు కోతుల్లాగా భయపడి ఎక్కడికి పోతారు? వెనక్కు తిరగండి. మీ కిప్పుడు ప్రాణభయం పట్టుకున్నదా ఏం? అ కనిపించేది యోధుడు కాడు. మనని భయపెట్టటానికి తయారుచేసిన యంత్రం. దీన్ని మనం నాశనం చేద్దాం,'' అన్నాడు.

అ మాటతో వానరులు ధైర్యం తెచ్చుకుని, చెట్లూ, రాళ్ళూ తీసుకుని యుద్ధభూమికి వెళ్ళారు. వాళ్ళు మదపుటేనుగుల లాగా కుంభకర్ణుడి మీద యుద్ధం చేశారు. అయితే వాళ్ళు వేసిన చెట్లూ, రాళ్ళూ కుంభకర్ణుణ్ణి కదిలించలేకపోయాయి. అతను వానరులను చంపసాగాడు.

ఈసారి వానరులు కుంభకర్ణుడి చేత దెబ్బతిని, వెనక్కు తిరిగి చూడకుండా అతివేగంగా పారిపోయారు. కొందరు వెళ్ళి సముద్రంలో దూకారు. కొందరు గాలిలోకి ఎగిరారు. మరికొందరు తాము వచ్చిన సేతువు మీదుగానే పారిపోయారు.

అంగదుడు పారిపోవద్దని వారిని హెచ్చరించాడు. ఇన్నివేలమంది వానరులు ఒక్క కుంభకర్ణుడికి భయపడటమేమిటన్నాడు. కాని వానరులు తమకు ప్రాణాలుదక్కితే చాలునన్నారు. అయినా అంగదుడు మంచి మాటలతో వారిని వెనక్కు మళ్ళించాడు. అతనికి హనుమంతుడు కూడా సహాయం వచ్చాడు.

తరవాత హనుమంతుడి నాయకత్వం కింద ఋషభుడూ, శరభుడూ, మైందుడూ,

ధూమ్రుడూ, నీలుడూ, కుముదుడూ, సుషేణుడూ, గవాక్షుడూ, రంభుడూ, తారుడూ, ద్వివిదుడూ, పనసుడూ యుద్ధానికి బయలుదేరారు. వాళ్ళు చావటానికి కూడా సిద్ధంగా ఉన్నారు.

ఈ లోపల కుంభకర్ణుడు వానరులను తినసాగాడు. ద్వివిదుడు ఒక కొండను పెకలించి, కుంభకర్ణుడి పైకి వెళ్ళాడు. అతను విసిరిన ఆ కొండ గురి తప్పి, కుంభకర్ణుడి వెంట ఉన్న సేనపైనపడింది. దానికిందపడి రథాలూ, గుర్రాలూ, రాక్షసులూ నుగ్గయిపోయారు. ఇంతలో ద్వివిదుడు మరొక పర్వతశిఖరాన్ని విసిరాడు. అది కూడా అంతులేని విధ్వంసం చేసింది. రాక్షసరథికులు వానరులను చంపారు; వానరులు మహావృక్షాలతో రాక్షసులను చంపారు.

హనుమంతుడు ఆకాశంలో నుంచి కుంభకర్ణుడి మీద రకరకాల శిలలనూ వృక్షాలనూ వర్షించాడు. కుంభకర్ణుడు తన శూలంతో పర్వతాలను పగలగొట్టి చెట్లను పక్కకు నెట్టేశాడు. తరవాత అతను ఆ శూలం చేతబట్టి వానరసేనను తరుముతూంటే, హనుమంతుడు ఒక కొండతో అతన్ని బలంగా కొట్టాడు.

కుంభకర్ణుడు శరీరం గాయమై, రక్తం కారింది. అతను తన శూలాన్ని గిరగిరా తిప్పి హనుమంతుడి రొమ్ములో పొడిచాడు. హనుమంతుడు భయంకరంగా అరిచి, నోట నెత్తురు కక్కుతూ, మూర్ఛపోయాడు.

నీలుడు కుంభకర్ణుడి మీదకు మరొక పర్వతశిఖరం విసిరాడు. కుంభకర్ణుడు దాన్ని తన పిడికిలితో పొడిచి నుగ్గు చేశాడు. ఋషభుడూ, శరభుడూ, నీలుడూ, గవాక్షుడూ, గంధమాదనుడూ ఈ అయిదుగురూ ఒక్కసారిగా కుంభకర్ణుడి పైకి వెళ్ళి చుట్టుముట్టి, రాళ్ళతోనూ, చెట్లతోనూ పిడికిళ్ళతోనూ, కాళ్ళతోనూ కొట్టారు. ఆ దెబ్బలు కుంభకర్ణుడికి సుఖంగా తోచాయి. అతను ఆ అయిదుగురు వానరవీరులనూ, ఒకరి తరవాత ఒకరుగా నెత్తురు కక్కించి, నేల కూల్చాడు.





# చెప్పులయోగి

చంద్రసేనుడనే రాజు వద్ద భూషణుడనే విదూషకుడుండేవాడు. వాడికి చమత్కారంతోపాటు పెద్దలను మెప్పించడం కూడా తెలుసు.

ఒక రోజున చంద్రసేనుడికి, వాడంటే విపరీతమైన అభిమానం పుట్టి, "నాకు హాని కలిగించనిదీ, నీకు లాభించేదీ ఏం కోరుకున్నా ఇస్తాను, అడుగు!" అన్నాడు.

భూషణుడు వినయంగా, "ప్రభూ! విదూషకుడి జీవితం కత్తి మీద సాము వంటిది. కాబట్టి మీ వరాన్ని నాకు అవసరమనిపించిన రోజున అడుగుతాను," అన్నాడు.

ఇందుకు రాజు సరేనన్నాడు.

చంద్రసేనుడి ఒక్కగానొక్క కొడుకు రుద్రసేనుడు, అమితగారాబం వల్ల చెడిపోతూంటే, రాజు వాణ్ణి గురుకులానికి పంపించాడు. గురుకులంలో వాడి ప్రవర్తన తిన్నగా వుండనప్పుడల్లా గురువు వాణ్ణి రాజధానికి పంపివేయడం జరుగుతూండేది.

ఆ విధంగా రుద్రసేనుడు తరచుగానే రాజాంతఃపురంలో కనబడేవాడు. ఒక రోజున చంద్రసేనుడు తన కుమారుడి గురించి భూషణుడి వద్ద దిగులుపడ్డాడు.

"యువరాజుకేం, ప్రభూ! తల్లిదండ్రుల మీది ప్రేమతో తరచుగా ఇంటికి వస్తూ కూడా, గురుకులంలో శ్రద్ధగా చదువుకుంటున్నాడు కదా!" అన్నాడు భూషణుడు.

"అంతా అలాగే అనుకుంటున్నారు. కానీ అసలు సంగతేమిటంటే, గురుకులాధిపతికి వాడి సంగతి నచ్చక శిక్షగా ఇంటికి పంపుతున్నాడు. వాడి ప్రవర్తననెలా బాగుపరచాలో, మాకు తెలియకుండా వున్నది," అన్నాడు చంద్రసేనుడు.

"వసుంధర"



అప్పుడు భూషణుడు రాజు తనకిచ్చిన మాట గుర్తుచేసి, "మీకు హాని కలిగించనిదీ, నాకు లాభం కలిగించేదీ ఇప్పుడు కోరుకుంటాను. నా తప్పుకు శిక్షగా దేవాలయం ముందు కూర్చుని, వచ్చే పోయేవారి చెప్పులు తుడుస్తాను. కానీ మీరు నన్ను శిక్షించినట్లు ఎవరికీ చెప్ప కూడదు," అన్నాడు.

కారాగారంలో వేయడం కంటే కూడా, ఇది దారుణమైన శిక్ష అనిపించి చంద్రసేనుడు తృప్తిగా ఒప్పుకున్నాడు.

మర్నాడే భూషణుడొక దేవాలయం ముందు కూర్చుని, వచ్చేపోయేవారితో, "అయ్యలారా! దైవదర్శనానికి వచ్చే వారికి, దైవదర్శనం చేసుకుని వెళ్ళే వారికి చెప్పులు తుడవాలని నిర్ణయించుకున్నాను. నాలోని అహంకారాన్ని చంపుకునేందుకిది శ్రేష్ఠమైన మార్గంగా కనబడింది. మీరందరూ నాకు సహకరించాలి," అని చెప్పసాగాడు.

మొదట్లో కొందరు వాడిని వేళాకోళ మాడారు. కానీ వాడు శుచిగా స్నానం చేసి గీతాపారాయణం చేసేవాడు. తన ముందాగిన వారిని పేదా, గొప్పా తారతమ్యం లేకుండా గౌరవించి చెప్పులుతుడిచేవాడు.

ఇలా కొద్ది రోజులు గడిచేసరికి ప్రజలకు వాడంటే గౌరవం ఏర్పడింది. చాలా

"అసలు విషయం ఇదా? అలాంటప్పుడు తమరు బాధపడి ప్రయోజన మేమిటి? ఇసుకలోంచి నూనెను తీయొచ్చు. ఎండమావిలో నీళ్ళు తాగొచ్చు. కుందేటి కొమ్మును తేవొచ్చు. మూర్ఖుడికి నచ్చజెప్పడంమాత్రం అసాధ్యమని పెద్దలు చెప్పనేచెప్పారు," అన్నాడు భూషణుడు.

చంద్రసేనుడికి పట్టరాని కోపం వచ్చి, "నా కొడుకును మూర్ఖుడంటావా ? నిన్ను కారాగారంలో వేయిస్తాను," అన్నాడు.

భూషణుడు వెంటనే, "ప్రభూ! నేను తప్పుజేశాను. మన్నించండి," అన్నాడు.

రాజు కోపం ఇంకా పెరిగి ససేమిరా అన్నాడు.

మంది చెప్పులు తుడిపించుకునేముందు, వాడికి నమస్కరించసాగారు. క్రమంగా కొందరు వాడికి సాష్టాంగపడడం ప్రారంభించారు. మరికొన్నాళ్ళకు దేవాలయానికి వెళ్ళని నాస్తికులు కూడా, వాణ్ణి చూడడానికి రాసాగారు.

మూడు వారాలు గడిచేసరికి, భూషణుడికి చెప్పులయోగి అని పేరు వచ్చింది. వాడిచేత చెప్పులు తుడిపించుకున్నవారి కోర్కెలు తీరతాయని నిదర్శనాలు కూడా చెప్పసాగారు.

చెప్పులయోగి గురించిన వార్త, రాజు చంద్రసేనుణ్ణి కూడా చేరింది. ఆయన సపరివారంగా అక్కడకు వెళ్ళి భూషణుణ్ణి చూసి తెల్లబోయాడు.

భూషణుడు, రాజు చెప్పులు తుడిచాక చుట్టుపక్కలవారితో, "అయ్యలారా! ఈ రోజుతో నా వ్రతసమాప్తి అయింది. మీ అందరి సహకారానికీ కృతజ్ఞుణ్ణి. నా స్థానంలో మరెవరైనా కూర్చోదలిస్తే కూర్చోవచ్చు." అన్నాడు.

అప్పుడు ఒకరుకాదు, ఇద్దరుకాదు— నేనంటే నేనని ఎంతోమంది ముందుకు రాగా, భూషణుడు వాళ్ళను మందలించి, వాళ్ళల్లో ఒకడిని కొత్తచెప్పుల యోగిగా నిర్ణయించి, "నీలో అహంకారం నశించిందని తెలిశాక మరొక కొత్తచెప్పుల యోగిని నువ్వే ఎన్నిక చెయ్యి." అని అక్కడినుంచి బయలుదేరి రాజప్రాసాదానికి వెళ్ళాడు.



జరిగిందానికి చంద్రసేనుడు వింత పడుతూ, "నాక్షోపంవచ్చి చెప్పాలు తుడిచే శిక్ష పడింది, నీకు. నువ్వు యోగి ఎలా అయ్యావు ?'' అని భూషణుణ్ణి అడిగాడు.

భూషణుడు మందహాసంచేసి, "ప్రభూ! ఋషి తలక్రిందులుగా వ్రేలాడితే తపస్సయింది. దొంగ వ్రేలాడితే శిక్ష అయింది. ఈ ప్రపంచంలో ప్రతి పనికీ సందర్భ సమయాలనుబట్టి, మంచిచెడ్డలు మారుతూంటాయి. శిక్ష అని చెప్పకుండా మీరు నాకు ఏ శిక్ష విధించినా, నేను ఆ శిక్షతోనే గౌరవం పొందగలను. మీరు నన్ను శిక్షించారని తెలిస్తే ప్రజలు నామీద రాళ్ళు విసిరి గేలి చేసేవాళ్ళు. నాది శిక్ష అని తెలియక, వాళ్ళు నన్ను యోగి అని గౌరవించారు,'' అన్నాడు.

"నువ్విలాంటి కార్యానికి పూనుకోవడానికి, తప్పక ఏదో కారణం వుండి వుంటుంది. ఇంతకూ నువ్వు నాకేం చెప్పాలనుకుంటున్నావు ?'' అని అడిగాడు చంద్రసేనుడు.

"ప్రభూ ! యువరాజుకు గురుకులాధిపతి శిక్ష విధించాడనుకోండి. అది పది మందికీ తెలిసేలాగా, యువరాజు పది మందిలో అనుభవించవలసిన పరిస్థితి ఏర్పడితే, ఆయనలో తప్పక మార్పు వస్తుంది. గురుకులంలో తన ప్రవర్తన బాగుండనప్పుడల్లా, అక్కడినుంచి అంతఃపురానికి వచ్చి సకల గౌరవాలూ పొందే వాడికి, తన తప్పెలా తెలుస్తుంది ?'' అన్నాడు భూషణుడు.

చంద్రసేనుడు కొద్దిసేపు ఆలోచించి, "చెప్పాలయోగికి గౌరవముందని, నగర పౌరులు చెప్పాలు తుడవడానికి పోటీ పడ్డారు. నువ్వు చెప్పింది నిజం. ఇక మీదట యువరాజు గురుకులంలో సాటి శిష్యులమధ్యనే శిక్షించబడవలసిందిగా ఉత్తర్వు జారీ చేస్తాను,'' అంటూ భూషణుడికి వెలలేని కానుకలిచ్చి సత్కరించాడు.

అచిరకాలంలోనే యువరాజులో కూడా మంచి మార్పు వచ్చింది.





# చదువులేని సామంతుడు

స్పెయిను దేశంలో ఒక జమీందారుండే వాడు. చాలా ధనవంతుడూ, గర్విష్ఠీ కావటం చేత అతను చదువుకోలేదు. తనకు అన్ని విషయాలను గురించీ పరిపూర్ణమైన పరిజ్ఞానం ఉన్నదనీ, రాయటమూ, చదవటమూ రానంత మాత్రం చేత తనకు కలిగే నష్టమేమీ లేదనీ, డబ్బు పారేస్తే రాయా చదవా గలవాళ్ళు ఎంతమందయినా వస్తారనీ అతను అనుకున్నాడు. కష్టపడి అక్షరాలు దిద్దటమూ, వాటిని కూడబలుక్కుని చదవటమూ తన హోదాకు తగదని అతని అభిప్రాయం.

అందుచేత అతను, హమేషా తన వెంట ఉండి, రాత కోతలు చూడటానికి ఒక పేద వాణ్ణి జీతానికి కుదుర్చుకున్నాడు.

ఒకసారి రాజుగారివద్దనుండి సామంతుడికి హుకుం వచ్చింది. ఎక్కడో యుద్ధం జరుగుతున్నది. "నీ సైనికులను వెంట తీసుకుని యుద్ధరంగానికి వెళ్ళి యుద్ధం చెయ్యి." అని రాజు తన సామంతుడైన జమీందారుకు ఉత్తరువు పంపాడు. జమీందారు వెంటనే తన సైనికులను ఆయత్త పరచి, తన లేఖకుణ్ణి కూడా వెంట బెట్టుకుని యుద్ధానికి బయలుదేరాడు.

కొంత కాలంపాటు అంతా సవ్యంగానే నడిచింది. ఏ రోజు యుద్ధవార్తలు ఆ రోజు లేఖకుడు రాసి, జమీందారు చేత ముద్ర వేయించి రాజుగారికి పంపేవాడు. కాని ఒకనాడు శత్రువుల బాణం ఒకటి గురి తప్పి వచ్చి లేఖకుడికి తగలటంతో అతగాడు కాస్తా కన్నుమూశాడు.

కొత్త లేఖకుణ్ణి ఏర్పాటు చేసుకునే అవసరం జమీందారుకు ఏర్పడింది. కాని అది ఆ పరిస్థితిలో అంత తేలికగా సాధించే పని కాదు. అప్పటికి కూడా జమీందారు రాజసం చావలేదు. "ఈ సమయంలో

స్పెయినుదేశపు జానపద కథ



నాకు చదవటమూ రాయటమూ వస్తే ఎంత బాగుండేది!" అని అతను తన మనస్సులోనైనా అనుకోలేదు.

ఇంతలో ఒక చిక్కు వచ్చి పడింది. ఒకనాడు రాజుగారి వద్ద నుంచి ఒక దూత వచ్చి, జమీందారు చేతికి ఏదో ఉత్తరం ఇచ్చి, వెంటనే తన గుర్రమెక్కి వెళ్ళిపోయాడు. రాజుగారు పంపిన ఆ సందేశం ఏమిటో జమీందారుకు తెలియలేదు. రాజుగారు తనను యుద్ధరంగంలో చొరవగా ముందుకు పొమ్మంటాడా? లేక తిరోగమించమని ఆదేశిస్తాడా?

జమీందారు చీకట్లో తడువుకుంటూన్న వాడిలాగా అయోమయంలో పడి కొట్టుకుంటూండగా ఒక సైనికుడు ఆయన కంట పడ్డాడు. ఆ మనిషి జమీందారుండే గ్రామానికి పొరుగున ఉండేవాడే. ఆ మనిషికి రాయటమూ, చదవటమూ తెలుసు. జమీందారు అతణ్ణి పిలిచి, "ఒరే, ఇదేమిటో చదివి పెట్టు. తప్పు చదివావో, డొక్క చీరేస్తాను. పైగా ఇందులో ఉండే విషయాలు నీకూ, నాకూ తప్ప మూడో మనిషికి తెలియరాదు. జాగ్రత్త!" అన్నాడు.

ఆ మనిషికి అసలే జమీందారంటే గుర్రు. ఎందుకంటే కొంతకాలం కిందట జమీందారు ఆ మనిషిని, ఏదో తప్పు చేశాడని, కొరడాలతో కొట్టించాడు. ఆ మనిషికి పగతీర్చుకోవటానికి మంచి అవకాశం దొరికింది. వాడు రాజుగారి ఉత్తరం చూసి, "కొంప మునిగింది! సేనానాయకత్వం వదిలేసి వెంటనే దర్బారుకు వచ్చెయ్యమని రాజుగారి ఆజ్ఞ! తమరు రాజద్రోహి అని ఎవరో ఆరోపించారుట!" అని చెప్పాడు.

"నేనా రాజద్రోహిని! అటువంటి మాట పుట్టించిన వాళ్ళు ఎంతటి దుర్మార్గులై ఉంటారు! స్వయంగా వెళ్ళి వాళ్ళను శిరశ్ఛేదం చేసేస్తాను," అన్నాడు జమీందారు.

అతను వెంటనే రాజధానికి బయలుదేరాడు. అది దూరప్రయాణమూ, కష్టప్రయాణమూ కూడానూ. ఊరూ పల్లె లేని చోట చీకటి పడింది. జమీందారు ఆ రాత్రి

గుర్రాన్ని ఏ చెట్టుకో కట్టేసి, కటికనేల మీద పడుకుని రాత్రి గడిపాడు. తెల్లవారి లేచి చూసేసరికి, దారికి ఒక పక్కగా ఒక పలక మీద ఏదో రాసి ఉన్నది. చదువు రాని జమీందారుకు ఆ రాసి ఉన్న దేమిటో తెలియలేదు. అందులో సంకేతా లేమైనా ఉండి అర్థమవుతాయేమోనని ఆ పలకను సమీపించి, కాలు జారి కందకంలో పడ్డాడు.

"దగ్గిరికి రావద్దు." అని ఆ పలక మీద రాసి ఉన్నది.

కందకంలో నుంచి బయటపడటం గగనమయింది. నడుముపట్టేసింది. జమీం దారు ముక్కుతూ, మూలుగుతూ దగ్గిర ఉన్న గ్రామాన్ని చేరుకుని ఒక సత్రంలాటి చోట పడక సంపాదించుకున్నాడు.

ఆ సత్రంలోనే జమీందారుకు పొరుగు గ్రామంవాడు తారసిల్లాడు. వాడు జమీం దారు నుంచి తప్పించుకుని పారిపో తున్నాడు. అందుచేత మళ్ళీ జమీందారు ప్రత్యక్షమయేసరికి వాడి ప్రాణాలు ఎగిరి పోయినంత పని అయింది. కాని జమీం దారుకు వాణ్ణి చూడగానే పోయే ప్రాణాలు తిరిగి వచ్చినంత ఆనందం కలిగింది.

"ఒరే, నేను రాజధానికి వెళ్ళే స్థితిలో లేను. రాజుగారికి ఈ పరిస్థితి తెలుపుతూ, కోలుకున్నాక వారి దర్శనం చేసుకుని,



నాపైన అభాండాలు వేసినవాళ్ళ అంతు తేలుస్తానని రాయి." అని జమీందారు ఆ మనిషిని కోరాడు. ఆ మనిషి జమీం దారు రాయమన్నట్టు రాయక, రాజును నానా దుర్భాషలూ ఆడుతూ ఉత్తరం రాసి ఇచ్చాడు. జమీందారు దాని మీద తన ముద్ర వేసి దాన్ని రాజుకు పంపేశాడు.

రాజుగారా లేఖను చూసి, తోక తొక్కిన తాచు లాగా లేచి, "ఆ భ్రష్టుణ్ణి ప్రాణాలతో గాని, శవంగా గాని వెంటనే పట్టుకు రండి." అని భటులకు ఆజ్ఞ ఇచ్చాడు.

జమీందారును పట్టి తెచ్చి కారా గృహంలో పెట్టారు. అమిత దురభిమాని కావటం చేత అతను రాజుగారికి ఏ విధ

మైన క్షమాపణా చెప్పటానికి ప్రయత్నించక, బిగుసుకు కూర్చున్నాడు.

జమీందారు చేత నిజం చెప్పించటానికి రాజు చిత్రహింసలు పెట్టించాడు. కాని జమీందారు తాను నిర్దోషి నని నోట అనటమే అవమానంగా భావించాడు. రాజు విసిగి, ''ఈ ద్రోహికి శిరశ్ఛేదం విధించుతాను,'' అన్నాడు.

న్యాయాధిపతి, ''మహారాజా, తొందర పడవద్దు. ఈ మనిషి తాను ముద్రవేసిన పత్రాలలో ఏ మున్నదీ చదవలేదేమోనని నాకు సందేహం కలుగుతున్నది," అన్నాడు.

''అతనికి చదవటమూ, రాయటమూ రాదని చెప్పుకుంటారు,'' అన్నాడు మరొక రాజోద్యోగి.

''ఏమిటీ? నా అంతవాడు అయి దేళ్ళు కష్టపడి రాయటమూ, చదవటమూ నేర్చుకోగా, ఈ హీనుడు ఆ పని కూడా చేశాడు కాడా? వాడికి చదువు రాదని ఎలా రుజువు చేస్తారు,'' అని రాజు తన వారిని అడిగాడు.

న్యాయాధిపతి జమీందారుకు మరణ శిక్ష విధించే ఉత్తరువును ఒక కాగితం మీద రాసి, దాన్ని జమీందారు వద్దకు తీసుకుపోయి, ''దీని పైన సంతకం చేస్తే విడుదల చేస్తాము,'' అన్నాడు.

''ఇందులో ఏమి రాసి ఉన్నది?'' అని జమీందారు అడిగాడు.

''నీవు నిర్దోషి వనీ, నీ పైన తెచ్చిన అభియోగం నిజం కాదనీనూ,'' అన్నాడు న్యాయాధిపతి.

''మంచిది. అలా అయితే సంతకం చేస్తాను," అంటూ జమీందారు వెంటనే తన ముద్రిక తీసి ఆ కాగితం మీద ముద్ర వేశాడు.

జమీందారు నిరక్షరు డని రాజుకు తెలిసిపోయింది. ఆయనను విడుదల చేసి పంపేశారు. జమీందారు పట్ల ద్రోహం చేసిన మనిషి దొరికాడు. వాడికి యావజ్జీవ ఖైదు విధించారు. చదువు రాకపోవటం తప్పే అయినా, నమ్మకద్రోహం దాని కన్న ఘోరమైనది గద!





# ఉపచారం

శ్రీరంగపట్నంలో కోదండపాణి గొప్ప వ్యాపారస్థుడు. రాత్రయ్యాక కొట్టు మూసి వేసి, ఇంటికి వచ్చి, డబ్బంతా చాప మీద కుమ్మరించి, లెక్కచూసి, మూటలు కట్టి భద్రపరచడం కోదండపాణి అలవాటు.

ఎప్పటిలాగే ఒకనాటి రాత్రి బాగా పొద్దు పోయాక, కోదండపాణి చాపపరుచుకుని డబ్బు లెక్క కడుతూన్న సమయంలో, ఎవరో తలుపు తట్టడం వినిపించింది. పరచివున్న రొఖ్ఖం మీద రుమాలు కప్పి, కోదండపాణి, వెళ్ళి తలుపు తీశాడు.

అక్కడ గురవయ్య కనిపించాడు. గురవయ్య కోదండపాణికి దూరపు బంధువు. కోదండపాణి వద్ద చాలా చనువు గల పెద్దమనిషి. అందువల్ల ఆయన సరాసరి, కోదండపాణి డబ్బు లెక్కిస్తూన్న గదిలోకి వచ్చి కూర్చున్నాడు. కోదండ పాణికి, ఏం చేయాలో తోచక, ''ఇంత అపరాత్రివేళ వచ్చావేమిటి గురవయ్యా." అని అడిగాడు.

గురవయ్య, ''ముఖ్యమైన పనిబడే వచ్చాను. బావా! ఉన్నట్టుండి ఓ పాతిక రూపాయలు కావలసి వచ్చింది. కాబట్టి నిన్ను వెతుక్కుంటూ వచ్చాను,"అన్నాడు.

కోదండపాణి కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''గురవయ్యా, నీకు తెలియని దేముంది చెప్పు. వ్యాపారం సరిగ్గా జరగడం లేదు. అందరూ అప్పులకే సరుకులను అడుగుతున్నారు. ఈ రోజు ఐదు రూపాయల బేరం కూడా జరగ లేదంటే చూడు!'' అన్నాడు.

''మిమ్మల్నే కొండలా నమ్ముకుని వచ్చాను. మీ దగ్గర లేకపోతే మరెక్క డయినా వడ్డీ కయినా ఇప్పించండి. ఎంత వడ్డీ అయినా ఫరవాలేదు. నా అవసరం అలాంటిది బావా!'' అన్నాడు గురవయ్య.

కోదండపాణి ఏమి చెబుదామా అని ఆలోచిస్తూండగా, కిటికీగుండా గట్టిగా వీచిన గాలికి పక్కన ఉన్న దీపం కాస్త ఆరిపోయింది. చిమ్మచీకటి కమ్ముకున్నది.

మరుక్షణమే కోదండపాణి, గురవయ్య చేతులు రెండూ గట్టిగా పట్టుకుని, ''గురవయ్యా, మరేమీ అనుకోవద్దు. నీ అంతటివాడు ఎంతో అవసరం కొద్దీ ఈ రాత్రివేళ వచ్చి డబ్బు అడిగితే ఇవ్వలేక పోతున్నాను కదా అని నాకెంతో బాధగా వున్నది,'' అని ఎక్కడలేని ఆప్యాయతనూ, సానుభూతినీ కనబరచసాగాడు.

''సరే బావా, నీ దగ్గర వుంటే కదా ఇవ్వడానికి? నువ్వు బాధపడవద్దు. మరెక్కడయినా ప్రయత్నించి చూస్తాను, ఇక నేను వెళ్ళి వస్తాను,'' అంటూ బయలుదేరబోయాడు గురవయ్య.

అయినా కోదండపాణి, పట్టిన చేతులు విడవకుండా, ''గురవయ్యా, రాకరాక వచ్చావు. వుండు, భోజనం చేసి వెళ్ళ వచ్చు!'' అని బలవంత పెట్టసాగాడు.

ఇంతలో పక్క గది నుంచి, కోదండపాణిభార్య, వెలుగుతున్న దీపాన్ని తీసుకు వచ్చింది. అప్పటికి కోదండపాణి గురవయ్య చేతులు వదిలిపెట్టి, ''మేము పిలవడమే తప్పు. నీలాంటివాళ్ళు మా ఇళ్ళల్లో భోంచేస్తారా?'' అన్నాడు.

''క్షమించు, బావా! నేను వెళ్ళివస్తాను,'' అంటూ గురవయ్య వెళ్ళిపోయాడు.

అక్కడి తతంగాన్నంతా వింతగా చూసిన, కోదండపాణి భార్య, భర్తతో, ''అయినా, గురవయ్య చేతులు పట్టుకుని ఎందుకండీ భోజనానికి అంత బలవంతం చేశారు?'' అని అడిగింది.

''ఓసి, పిచ్చిమొహమా! వాణ్ణెవడు భోజనానికి బతిమలాడాడు? దీపం ఆరిపోయి, చీకటయిపోయింది కదా, ఆ చీకట్లో వాడు డబ్బు కాజేస్తాడేమోనన్న అనుమానం కొద్దీ అలా నాటకం ఆడవలసి వచ్చింది!'' అన్నాడు కోదండపాణి.

భర్త సమయోచితయుక్తికి చాలా సంతోషించింది కోదండపాణి భార్య.



## నీలి గులాబీలు!

ఒకప్పుడు అసాధ్యమనుకున్న చాలా విషయాలు ఇవాళ సాధ్యమవుతున్నాయి. ఇది గులాబీలకు కూడా వర్తిస్తుంది. ఎందుకంటే కొన్నాళ్ళక్రితం అసాధ్యమనుకున్న నీలి గులాబీలను, సృష్టించడానికి ఆస్ట్రేలియా విజ్ఞానవేత్తలు చేస్తూన్న కృషి త్వరలో ఫలించనున్నది. పువ్వులకు నీలిరంగునిచ్చే 'జన్యపదార్థా'న్ని వేరుచేసి, గులాబీ మొక్కలకు ఎక్కించడంవల్ల ఇది సాధ్యమవుతుంది. 1993 వ సం॥ ఆరంభంలో నీలిగులాబీలను పెంచవచ్చని చెబుతున్నారు।





## అరుదైన రాబందులు

మన దేశంలో ఎనిమిది రకాల రాబందులు ఉన్నాయి. వీటిలో పాండిచ్చేరి రాబందులు చాలా అరుదైనవి. ఇవి దాదాపు నశించిపోయే స్థితిలో ఉన్నాయి. ఈ జాతి రాబందులు ఒకప్పుడు శ్రీలంకలోనూ, బంగ్లాదేశ్‌లోనూ వుండేవి. అవి ఇప్పుడు కనిపించడం లేదు. అహ్మదాబాదులోని కమలానెహ్రూ జంతు ప్రదర్శన శాలలో ఈ జాతికి చెందిన మూడు రాబందులు ఉన్నాయి. వీటిని రాజరాబందులు అనికూడా అంటారు. ఎర్రటి తలగల ఈ రాబందులు మనుషులకు దూరంగా ఉంటాయి.

## అత్యధిక సంఖ్య!

భూమిమీది ప్రాణులన్నిటిలోకి పురుగులే అత్యధిక సంఖ్యలో ఉన్నాయి. పురుగులలో దాదాపు 2,50,000 రకాలు ఉన్నాయి. కీటకాలలో 50,0000 రకాలు ఉన్నాయి. ప్రపంచంలోని మొత్తం కీటకాల సంఖ్య 1,000,000,000,000,000,000।



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 సెప్టెంబరు నెల సంచికలో ప్రకటింపబడును.



M. C. Morabad



Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: - చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బడాయి బాబు పాట! రెండవ ఫోటో: లడాయి కాదిది ఆట!

పంపినవారు: ఆవుపాటి శారద, క్లర్క్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్,
బెల్లంపల్లి - 504 251. ఆదిలాబాదు జిల్లా (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

